# లోకంకోసం

చీకటి కన్నుపొడుచుకున్నా కనుపించటంలేదు. మబ్బు పట్టిందేమో చుక్కలకాంతికూడా లోకానికి కరువయింది. అంతటి భయంకర వాతావరణంలో నేను నాలుగు గజాల గోడనూ దూకి వామి చాటున కూచున్నాను.

నా సాహసానికి నాకే నవ్వొచ్చింది. అంత గోడను నేనెలా దూకానో నాకే అర్థంకావటంల్లేదు. తలుచుకుంటే వొళ్ళు గగుర్పొడుస్తోంది. అంత ఎత్తునుంచి దూకినా నాకే మాత్రం బాధగా లేకపోవటమనేది ఆలోచించదగ్గ విషయం. అప్పుడు కాలో చెయ్యో విరిగితే నా గతేంకాను? నా భవిష్యత్తంతా ఏమవుతుంది? జీవితాంతంవరకూ దుఃఖించాలిసొస్తుంది. తప్పదు-కానీ నరసమ్మ జ్ఞాపకంవస్తోంటే ఇదంతా తృణప్రాయంగా వుంది నాకు. లోకంలో ఏ కష్టమూ లేకుండా సుఖపడటమనేది సంభవించదు. సుఖపడేదానికోసం మానవుడు కష్టపడాలి. 'సుఖం' అనే లాభానికి ఈ 'కష్టం' పెట్టుబడి లాంటిది.

అందులో ఇది మామూలు సుఖం కాదు. అన్నిటికంటే లోకంలో గొప్పది. నరసమ్మకు చదువురాదు. నవ నాగరికతా వాసనలు ఇంకా నరసమ్మదాకా పాకలేదు. అయితే నేం? నరసమ్మ అందంగా వుంటుంది. బరువుగా కలలు కంటోవుంటాయి కళ్ళు, చామనచాయగా, బలంగా, కండరాలు మెలితిరిగి, గట్టిగా వుంటుంది వొళ్ళు. ఖచ్చితంగా నా

భుజాలదగ్గరకొస్తుంది. నరసమ్మను చూస్తుంటే ఆమె అంగీకారం లేకుండానే వెళ్ళి కావిలించుకొని, ఆ బలమైన శరీరాన్ని చేతులనిండా పొదువుకొని, అట్లా ముద్దుపెట్టుకోవాలని పిస్తుంది ఎవరికైనా. అడగటమే ఆలస్యంగా ఆవిడ తన కావిలిలోకి వస్తుందనే భ్రమను, ప్రతి మొగవాడూ ఆమెను చూడగానే పొందుతాడు.

నరసమ్మకూ నాకూ మధ్య రెండు నెలల నుండీ ఈ కార్యక్రమం జరుగుతూ వుంది. నరసమ్మ మొగుడు ముసలివాడు గానీ, దుర్బలుడుగానీ కాదు. నాబోటి పిచ్చికగాళ్ళను వొక చేత్తో యమదర్శనం చేయించగలడు. మరి నరసమ్మకి బుద్ధి ఎందుకు పుట్టిందో నాకు తెలీదు. తెలుసుకోవాలని కూడా నేను కోరటల్లేదు. తన చిన్నప్పటి ప్రియుల దగ్గర నుండి, భర్తా తనూ జరుపుతున్న ప్రణయ కలాపాలతోసహా పూసగుచ్చినట్లు నాతో చెప్పిన నరసమ్మ ఈ సంగతిని గురించి నేను అడిగితే చెప్పకపోదు. కానీ నాకే మనస్కరించలేదు. ఏవో కొన్ని మానసిక దుర్బలతల చేతనే నరసమ్మ నన్ను కోరిందేమో! ఆ దుర్బలతలను అట్టేవుంచి, నా అవసరాలను తీర్చుకోకుండా, ఆ నిద్రనుండి లేపి, జ్ఞానాన్ని కలిగించి, తనుచేసిన పనికి పశ్చాత్తాపపడి, నా నుండి, అందకుండా పోయేట్టు, నేనెట్లా చేసుకోను?.........

అయినా ఎక్కువకాలం నేనీ శ్రమపడలేను. ప్రతి రోజూ గాకపోయినా కనీసం వారానికి వొకసారయినా ఈ గోడలు గెంతటం తప్పటల్లేదు. నరసమ్మ భర్త కొట్టందగ్గర లేకపోతే హాయిగా ఆ వాకిలిగుండా వామిచాటుకు చేరొచ్చు.

అతగాడు అక్కడ వుంటేమాత్రం ఈ ఫీట్ చెయ్యాక తప్పదు. నరసమ్మ అంగీకరిస్తే ఆమెను నా గదికి తీసుకుపోగలను. లేదా ఏ మిత్రుణ్ణి అర్థించినా, నా కాపాటి స్థల ధర్మం ప్రసాదించకపోడు. సాంసారికమైన యిబ్బందుల వల్లనేమో, నరసమ్మ ఈ ఏర్పాటుకు అంగీకరించలేదు. కనీసం నేనన్నా ఆమె యింటికి స్వేచ్ఛగా వెళ్ళడానికి వీల్లేకుండావుంది. భర్తను కలిగివున్న గృహిణి ఆమె. అతనికి తెలిస్తే!

ప్రతి రోజూ రాత్రి పదిగంటలు దాటిన తరువాత నేను వామిపక్కకు జేరుతాను. నరసమ్మ పక్క కొట్టంలో వేసుకుంటుంది. తెల్లవారుఝాముదాకా మా కార్యక్రమం జరిగిపోతుంటుంది. ఇది దాదాపు నాకూ, ఆమెకూ పరిచయం కలిగినప్పటి నుండీ జరుగుతున్నది. ఇంతకాలమూ భర్త ఆమెను అనుమానించకుండా వుండటమనేది అసంభవం—ఏదో పనివుండేమో అని వొకటి రెండు రోజులు సగిపెట్టుకున్నా... యింతకాలం అదే నమ్మకను పట్టుకొని అతను వేళ్ళాడుతుంటాడని నేను విశ్వసించలేను. అయినా ఆడది రాత్రిపూట గొడ్లకొట్టంలో చెయ్యావలసిన పనులేముంటాయి గనక? — అందులో భర్త అనేవాడు వున్నప్పుడు"?......

చాలా పొద్దుబోయిన తరువాత నరసమ్మ వొచ్చింది. ఒస్తూవొస్తూ మధ్యాన్నం తను చేసిన పులిబొంగరాలు నాలుగు తెచ్చింది నాకు—నరసమ్మను చూస్తుంటే, చీకటయితే మాత్రమేం గనక–నేను పడ్డ శ్రమంతా మరిచిపోయాను. అట్లా నరసును నా వైపు తీసుకొన్నాను.

"చాలా పొద్దుబోయింది. పిల్లవాడు యిప్పటిదాకా

నిద్రపోనేలేదు" అన్నది నరసమ్మ, నన్ను గట్టిగా ఆనుకొని తన చేతుల్లోకి నన్ను పోదుపుకుంటూ.

"ఎంత ఆలస్యమైనా ఈ వాక్కు రోజేగా! రేపట్నుంచీ ఈ బెడద ఎవరికీ వుండదు" అన్నాను.

"ఏం?" అన్నది కొంచెం అదిరిపడి.

"రోజూ నేనీ కష్టాన్ని చెయ్యలేను. నువ్వంటే నాకెంతో యిష్టం. ఈ అందమైన వొంటికి నే నే త్యాగమైనా చెయ్యగలను-కానీ ఎంతకాలం యిదిసాగుతుంది? నీ భర్తకు తెలిస్తే ఏనాటికైనా యిది వికటించకపోదు............"

'ఈ అందమైన వొంటికి ఏ త్యాగమైనా చెయ్యడానికి సిద్ధపడ్డ నువ్వు ఈ కొంచెం కష్టం ఎందుకు పడలేవు? దీనికే త్యాగం చెయ్యలేనివాడివి నా కోసం ఇంకేమిచేస్తావు' అని నరసమ్మ నన్ను అడగలేదు. బతికిపొయ్యాను.

"ఇది ఆయనగారికి యింతకాలమూ తెలియకుండా వుందనేనా మీ వుద్దేశ్యం?"

"అవును. తెలుసా?"

"మనిద్దరి తతంగమూ, ఆయనకు మొదటినుంచీ తెలుసు. ఇంతకాలం వొక్కత్తెనూ, ఇక్కడ ఎందుకు పడుకొంటున్నానో అర్థంచేసుకోలేనంత మూర్ఖుడుగాడాయన"

"మరి......?"

"నా స్వభావం ఆయనకు తెలుసు. నేను కాపరాని కొచ్చిన తొలిరోజుల్లో కాఫ్యా చేతులూ అంటగట్టి గొడ్డును

బాదినట్టు బాదేవాడు. కూడూ నీళ్ళూ లేకుండా గదిలో పడేసి మూడేసిరోజులు తాళంబెట్టేవాడు. ఇంతటి హింసనూ చిల్చుకొని నా స్వభావం తలెత్తసాగింది. విసిగి ఆయన నిరాశ చేసుకొని, చూసీచూడనట్టు పోతున్నాడు"

చాలా ఆశ్చర్యమేసింది. నరసమ్మ పతివ్రత అని నేననుకోను. పతివ్రత అయ్యే పక్షంలో, ఇట్లా దానివొళ్ళు నా చేతుల మధ్య వుండేదికాదు. లోకం చాలా తుచ్ఛంగా పరిగణించే 'కామం' లో ఎంతటి శక్తివున్నదో అప్పుడు నాకు స్పష్టంగా ఆకళింపయింది. అదే లేకపోతే నే నీ పద్మవ్యూహాన్ని భేదించుకొనిరాను. నరసమ్మ యిట్లా చెయ్యనూ చెయ్యదు.

"ఎట్లాగూ నీ భర్తకు తెలుసునంటున్నావు గాబట్టి, ఇకనుండి నేను నేరుగా మీ యింటికె వస్తేనేం? భర్తభయం గూడా లేనప్పుడు? అతనుచూసి దండించనుగూడా లేడాయె! ఆ ఏర్పాటు నువ్వెందుకు చెయ్యగూడదు? నాకీ దూకటాలు తప్పుతై. ఈ కొట్టంలో పడుకొని......"

నరసమ్మ కాసేపు ఆలోచించి 'సరే రేపణ్నించీ రండి' అన్నది.

వారం రోజులు మామూలుగానే గడిచినయ్. అసలు విషయమేమిటో తెలిసింది గనక నరసమ్మ భర్తంటే నాకు గడ్డిపోచసమం అయ్యాడు. సాయంత్రం ఆరుగంటల కల్లా అన్నంతిని వాళ్ళింటికి వెళ్ళేవాణ్ని. కాసేపు వాళ్ళబ్బాయికి 'శాస్త్రాలు' చెప్పేవాణ్ని. అతను మాత్రం నాతో ఏమీ

మాట్లాడేవాడు గాదు. చాలా కోపంగా, బోనులోవున్న పులికిమల్లే చూస్తుండేవాడు. అయినా నేనాట్టే భయపళ్ళేదు. అతను అన్నంతిని చుట్టకాలుస్తో ఆరుబైట పడుకొనేవాడు. నేను నరసమ్మను తీసుకొని గదిలో పడుకొనేవాణ్ని.

ఈ విషయం యింతకాలం లోకానికి తెలియకుండా వుంటుందని నేనెప్పుడూ అనుకోలేదు. ఇదివరకు తెలిసినా తెలియకపోయినా కనీసం ఈ వారంనుండయినా తెలిసి తీరుతుంది. ఇదివరకు పిరికిగా, భయపడుతూ ఏ. రాత్రిపూటో, ఏ మూలనో జరిగిపోయేది. ఈ స్వేచ్ఛ నాకు లభించినప్పణ్నుంచీ నేను పబ్లిక్‌గా రాక పోకలు సాగించాను. పగటిలో ఎక్కువకాలం ఆ యింట్లోనే గడుపుతున్నాను.

వారంరోజులు మామూలుగానే గడిచినయ్. ఒకనాడు నేను రోజూమల్లేనే, పెందరాళే నరసమ్మ యింటికి వెళ్ళాను. ఆమె మొగుడు భీకరంగా వొకబడిత తీసుకొని వసారాలో నిలబడివున్నాడు. ఇంటోనుండి నరసమ్మ ఏడుపు వినిపిస్తోంది. ఈ వెధవ ఏంచేశాడు నరసమ్మని? ఎందుకు కొట్టాడు? నరికితే, పచ్చడి పచ్చడిగా చితగ్గొడితే? అమాంతం మీదపడి గొంతు పిసికి......లాభంలేదు. అతను వూపేవొక్కవూపుతో నా ప్రాణాలు కడబడతాయి. ఏం చెయ్యను?

గబగబా యింటోకి పోతున్నాను.

"ఆగు" అన్నాడు. నరాలుజవచచ్చి నిలబడ్డాను.

".ఈ రోజునుండి ఈ గడప తొక్కావంటే డొక్క చీల్చి ఎండేస్తాను. నాలుగు కాలాలపాటు బతకదలచుకుంటే వెంటనే తిరిగి వెళ్ళిపో".

కొయ్యబారిపోయ్యాను.

"నడవ్వేం?" బడితపైకిలేపి నావైపు వొస్తున్నాడు.

పోయినచైతన్యం వొక్కసారిగా నాలోకి వొచ్చింది. ఇంటికొచ్చిపడ్డదాకా నేను ఎక్కడా నడిచినట్టు జ్ఞాపకం లేదు......

ఎందుకిట్లా మారిపోయ్యాడు? రహస్య సమావేశాలను అంతకాలం భరించినాయన, వారంరోజులు బహిరంగకూటములూ అంగీకరించినాయన! ఏమయిపోయింది నరుసు? దానికీ నాకూ రుణం తీరిపోయింది. ఎందుకనో నాలో పెద్ద అగాధం ఏర్పడినట్లనిపించింది. దానితో గడిపిన కాలాన్ని మననం చేసుకొంటూ కూచున్నాను. దిగులేసింది. ఏడుపొచ్చింది......

"ఏమిట్రా ?" అంటూ వెంకటేశ్వర్లు వొచ్చాడు.

అంతా విన్నాక కూడా వాడు ఆశ్చర్యపడకపోవటం నన్ను ఆశ్చర్యపడేటట్టు చేసింది.

"అదిసరేలే! ఇంతకాలమూ సహించినవాసు, యివ్వాళ ఎదురుతిరగటానికి గల కారణమేమిటో నాకు అర్థంకాలేదు" అన్నాను.

"కావటాని కిందులో ఏముంది? ఇంత కాలం నువ్వు రహస్యంగా వ్యవహారకాండ జరుపుకొంటూ వొచ్చావు. అది దాదాపు లోకానికి తెలియదనే అనుకోవచ్చు. తెలిసినా తెలియకపోయినా 'అతను' మాత్రం, తనకుతప్ప యింకెవరికీ తెలియదనే నమ్మకంలో వున్నాడు. అట్లా జరుపుకొచ్చ

కొన్నా ఈ గొడవ జరిగేదిగాదు. మరి నువ్వు బహిరంగంగా అఘోరిస్తివి....."

"అతను మారటానికి....."

"ఇప్పుడా నమ్మిక అతనిలో పూర్తిగా నశించిపోయింది. నువ్వు రావటం ప్రత్యక్షంగా చాలమంది చూస్తున్నారు. లోగడ గుప్తంగా వుంచబడిన వొకానొక రహస్యాన్ని బట్ట బయలు చేశావన్నమాట. తన గుట్టుకాస్తా పదిమందికీ తెలిసి పోయిందనే వుద్దేశ్యంతో అతను నిన్ను తన్నడానికి తయారయ్యాడు. అంతేగాని నువ్వంటే సహించలేక కాదు. అతను సహిస్తాడు. కానీ లోకం సహించదు. లోకందృష్టిలో తన విలువ నిలబెట్టుకోనేదాని కోసం; కనీసం నిలబెట్టుకొన్నాననే ఆత్మతృప్తికోసం, అతనీ పని చేశాడు. ఒకపని—ఎంత నీచమైన దయినా నువ్వు రహస్యంగా చెయ్యి. అది రహస్యంగావున్నంత కాలం నిన్నెవరూ ఏమీ అనరు. కానీ దాన్ని గురించి నువ్వు బహిరంగంగా మట్లాడబోకు. దాన్ని వెల్లడి చెయ్యబోకు—లోకం సహించదు....."



# ఆ హి రి

ఆపూట లలిత మనస్సు మనస్సులోలేదు. ఆలోచన లతో అలసిపోయింది. తర్క వితర్కాలతో, ఆమె మెద డంతా తుకతుకలాడిపోయింది! ఈ సంగతి భర్తతో చెప్ప డమా, మానడమా, అని చాలాసేపు మథనపడింది! అయినా ఓ దారికి రాలేకపోయిం దామె.

దాదాపు అయిదారు నెల్లనుండి ఆ యింట్లో ఉంటు న్నారు. బంధుత్వం లేదన్న మాటేగాని, శారదా తనూ ఓ తల్లి బిడ్డల్లాగే మసిలారు. చాలా ఉమ్మడి కొంపల్లో వచ్చే చిన్న చిన్న తగాదాల్లాంటివి కూడా తా మెరుగరు. తా మిద్దరూ పోట్లాడుకోవాలనీ, అలా పోట్లాడుకుంటున్నప్పుడు చూడాలని చాలామందికి ఉన్నదని తనకూ తెలుసు, శారదకూ తెలుసు! అయితే మట్టుకు-ఇంకోరిసరదాకోసం, గిల్లి కజ్జా పెట్టుకోవడానికి, ఇవతలివారు, అమాయికులూ, చిన్నపిల్లలూ కాదు.

నిజానికి శారద ఎంత మంచిది! అస్తమానూ, 'వదినా! వదినా!' అంటూ వెంపర్లాడుతుంటుంది. ఆ కాస్త పనీ అయి పోగానే, తమభాగంలోకే వచ్చేస్తుంది! పట్టుదలకోసమన్నా- ఓసారి వారి భాగంలోకి ముందుగా వెడదామని, తను, అనేక సార్లు అనుకొన్నది! అదేం గ్రహచారమో గానీ, అది నిడివే రనే లేదు. ఎంత తొందరగా తెములుదామన్నా, ఈ పని తీరిచావదు. శారద తెములుకొని, బైటపడుతుంది మరి!

ఏమాట కామాటే చెప్పుకోవాలి! శారద తనకంటే అందమైందే! ఆడవారు, ఆడవారి అందాన్ని ఒప్పుకోరం టారు గానీ, అది నిజం కాదు. శారద అందగత్తెఅని, తను చూసిన మొదట్లోనే అనుకొన్నది! ఆలోచిస్తుంటే, ఆనాటి సంగతులన్నీ తనకిప్పుడు జ్ఞాపకమొస్తున్నాయి. మొట్టమొదటి సారి, శారద, రాంమూర్తి ఇల్లు చూసుకొందుకు వచ్చి నప్పుడు, ఆవిణ్ని చూస్తూనే, వారికి ఇల్లు కుదరనివ్వకూడ దనుకొంది తను. ఇలాంటి సొగసులాడి, ప్రక్క భాగంలో ఉంటే... హాయ్యో రాత...... ఈయనగారింకా, చేతికి చిక్కుతాడా అనుకుంది! అసలే అంతంత మాత్రంగా ఉన్న ఈ సంసారం, మరింత కుమ్ముదుమ్మవుతుందేమో భగవం తుడా అని భయపడింది!

కానీ, తననుకొన్న వేమీ జరగలేదు; ఒకరకంగా చెప్పాలంటే, తనప్రయత్నాలు కొనసాగకపోవడమే మంచి దనిపించింది. నిజంగా కొనసాగి ఉన్నట్లయితే—ఈ శారదకు బదులు, ఇంకెవరు ఈ భాగంలోకి వచ్చేవారో! వాళ్ళెటువంటి వాళ్ళో ఎవ్వరూ చెప్పలేరుగదా!

శారద చాలా ఉత్తమురాలని తెలుసుకోవడానికి, తన కెక్కువ రోజులు పట్టలేదు. ఇంట్లోచేరిన గంటకల్లా 'ఏమండీ అక్కగారూ!' అంటూ శారద కేకేసింది. అప్పుడీ మనిషి ఇంట్లోనే ఉన్నాడు. దొడ్లో ఏదో పనున్నవాడిలాగా వెళ్ళి, శారదను చూసొచ్చి 'చాలా అందమైన చెల్లెల్ని సంపాయిం చావోయ్!' అన్నాడు సిగ్గు లేకుండా! అయినా మొగవాళ్ళ కింత సిగ్గూ శరమూ ఉండదేం? అదో ఘనకార్య మనుకుం

టారో ఏమో మరి- పెళ్ళాం అక్కడున్నదే, ఆవిడేమయినా అనుకొంటుందేమో ననిగూడా ఆలోచించకుండా, నోటికి ఎంతమాటొస్తే అంత మాటా అనేస్తారు! అలాగే ఇవతల వారుగూడా ఉంటే. వారికెలా ఉంటుందీ? ఆ మాత్రం తెలుసు కోకపోతే ఎట్లా?

శారద అటువంటి మనిషని కాదు గానీ, ఎందుకైనా మంచిదని, తనే 'వదిన' వరసకి మార్చింది. ఆఁ, తెగించిన వారికి వరసా వాయీ అడ్డా ఏమిటి? ఆ శాస్త్రుర్లుగారి కూతుర్ను, 'అక్కాయ్, అక్కాయ్' అంటూనే, వారాల కుర్రాడు లేవదీసుకెళ్ళలేదూ? అప్పుడేవరసలు అడ్డొచ్చాయి గనక? కాదుగానీ, మన జాగర్తలో మన ముండటం మంచిదే! ఆపైన, అన్నిటికీ, ఆ నారాయణమూర్తే ఉన్నాడు.

తనింత పకడ్బందీగానూ ఉన్నది. రాంమూర్తిని 'అన్న గారూ'! అని నిండుగా, నోరారా పిలిచేది. ఆయనగూడా 'ఏమిటమ్మాయ్?' అని ఆప్యాయంగా పలికేవాడు. అటువంటి వాడికే, ఈ వెధవాలోచన ఉన్నదంటే త నేమనుకోవాలి?

ఈ మొగాళ్ళకున్న అహంకారానికి—పెళ్ళాలే గనక లేకపోతే, లోకం భగ్గునమండిపోదూ? శారద ఊళ్ళో ఉన్నంత కాలమూ, కుక్కిన పేనులాగా పడున్నాడు రాంమూర్తి. కన్నెత్తి తనకేసి చూడనన్నా చూసేవాడుకాదు. తను నాలుగైదుసార్లు ఈమాటే శారదతోగూడా అన్నది. 'ఆయ నంతే వదినా! ఆడాళ్ళంటే పరమ సిగ్గు' అన్నది శారద. ఇదంతా నాటకమనే సంగతి, తన కిప్పుడుగానీ అర్థం కాలేను. ఈ మొగాళ్లు, ఎంచక్కా నటిస్తారనీ!

శారదకు గూడా తన మొగుడి బుద్ధి బాగా తెలుసు లాగుంది; లేకపోతే 'హోటల్లో భోంచేస్తార్లే వదినా! నీ కెందుకొచ్చిన శ్రమ!' అంటుందా? పిచ్చిముండ! తనే తెలుసుకో లేకపోయింది. ఆవిడ వద్దన్నకొద్దికీ, తనే బలవంతం చేసింది. 'మా అన్నగారికి మేం తక్కువ పెట్టుకోం లేవోయ్' అంది. 'ఇవన్నీ అనకపోతే, మా యింట్లో తినడం ఇష్టం లేదన రాదూ? తీరిపోతుందిగా!' అని తను యాష్టపడ్డది! 'ఇరుగూ పొరుగూ అన్న తరవాత, ఇబ్బందుల్లో సబ్బందుల్లో ఆదుకోక పోతే ఎందుకూ?' అన్నది. ఇన్నన్న తరువాత గానీ 'నీ ఇష్టం!' అనలేదు శారద. అంటే ఏమిటన్నమాటా? తన మొగుడు బుద్ధిని తనే నమ్మలేదన్నమాట! ఆవిణ్నననడం కాదు గానీ, ఈ మనిషిని, తనీనాటికి నమ్మగలదా?

దోవనపొయ్యే తద్దినాన్ని కొని తెచ్చుకున్నట్లయింది. అప్పుడన్నివిధాలుగా శారదను బలవంతపెట్టకుండా ఉండాలి సింది. మొఖమోటానికి ఏదో ఒకసారీ అరసారీ అని- మెదలకుండా ఊరుకోవలసింది! పోనీలే—పొరుగున ఉంటు న్నారుగదా, అవసరాలనేవి అందరికీ వుంటాయిగదా, ఓ పది రోజులపాటు ఉడకేసిపెడితే, పోయిందేమిట్లెస్తూ అనుకొన్నది గానీ, ఈ మూర్తిగాడిలా తయారవుతాడని తను ఊహించ లేకపోయింది!

అయినప్పటికీ తను 'అన్నగారూ! అన్నగారూ!' అం టూనే ఉంది. ఆ వెధవగూడా 'అమ్మాయ్, అమ్మాయ్!' అనే వాడు. అలాంటివాడికి ఈ అపరబుద్ధి ఎందుకు పుట్టి నట్టూ? అందుగ్గాదూ, లోకం ఇలా పాడై పోయింది!

అంతక్రితం తలెత్తిగూడా చూడనివాడు, శారద వెళ్ళి నప్పట్నుంచీ, చూసి నవ్వడంగూడా సాగించాడు. ఎందుకో గదా అనుకొంది తను. అలాఊరుకోవడమే తనకొంపతీసింది! నవ్వినప్పుడే, పెట్టవలసిన నాలుగూ పెట్టవలసింది! 'అన్నాయ్' అంటున్నాంగదా, వీడికిమాత్రం ఆ పోకడల గుణం పుట్టబో తుందా అని—తను తాత్సారంచేసింది. ఇది, ఆ వెధవకు, మంచి ప్రోత్సాహమిచ్చింది. మూడో రోజునుండి పూలు పట్టుకురావడం మొదలెట్టాడు. అప్పుడుగూడా తను, అనుమా నించిచావలేదు. పెళ్ళాం వున్న రోజుల్లో తెచ్చేఅలవాటు ప్రకారం తెచ్చాడని సరిపెట్టుకొంది. అదేం ఇదేమని—నిన్న సాయంత్రం చెయ్యిపట్టుకున్నాడు. ఆ నారాయణమూర్తి దయవల్ల-ఎవ్వరూ చూడకపోబట్టి సరిపోయింది. తనఖర్మం గాలి, ఎవరికంటనన్నా పడితే కాపరానికి నీళ్లొదులు కోవడ మేనా, ఇంకేమయినా ఉందా!

పోనీ, ఈ మనిషన్నా కాస్త మంచివాడై తే అనుకోవ చ్చు. అప్పుడెప్పుడో, ఆ రాజారావు ఫోటో పెట్టెలో ఉన్నదని, ఇప్పటికీ సాధిస్తుంటాడుగదా! అట్లాంటి అనుమానం మనసులో ఉన్నవాడికి, ఈమాత్రం సందు దొరికితే, తన కాపరం ఇంకా నిలవనా? తన్ని తగిలేసి, ఇంకెవత్తెనో పెట్టుకు ఊరేగడూ? ఇప్పుడు సరిగ్గా ఉంటున్నాడని మాత్రం ఏమిటి గానీ, అప్పు డీ అడ్డంకిగూడా లేకుండాపోతుంది.

అయినా ఈ రాంమూర్తిగాడికిదేం లేకిబుద్ధి? తన చక్క దనం చూసి భ్రమసిపోతారనుకొన్నాడా? తన డబ్బుకు లొంగి పోతారనుకొన్నాడా? వీడి బాబాయిల్లాంటివాళ్ళను తను

చూసింది! వీడి లెక్క ప్రకారం, వాళ్ళందరికీ తను లొంగి
పోవలసిందేనా? హయ్యో రాత! వీడింత తెలివితక్కువ వెధ
వేమిటీ? వీడనుకొన్నదే నిజమయితే, తనెప్పుడో వీడికి లొంగి
పోవాలిసింది! మాటొచ్చిందని కాదు గానీ, రాంమూర్తి
అందగాడే! అలాంటి అందమంటే తనకు ఇష్టం గూడానూ!
ఈ మనిషి రాంమూర్తిలాగా ఉంటే ఎంత బాగుండును!
ఈ రాంమూర్తిలాంటివాడు తనకు భర్తగా దొరికితే ఎంత
సంతోషిద్దును......ఇలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు తనకు
కలిగిన మాటగూడా నిజమే! భగవంతుని ముఖంచూసి చెప్పా
లంటే— తన కట్లా అనిపించింది మరి! అనిపించిందిగదా అని,
తనేమన్నా తూలిందా? లేదే!

ఎందుకో, హఠాత్తుగా, తనకు అనిపించింది, ఈ
రాంమూర్తి, ఒంటరిగాఉన్నప్పుడు ఏదన్నా అఘాయిత్యంచేస్తే
ఏమిటి చెయ్యడమూ అని! అలా ఎందు కనిపించిందో తనకు
తెలీదు. మనసులోని ఆలోచనలు గ్రహించినవాడిలా,
ఈ త్రాపి అంతపని చేశాడు. నిన్న చెయ్యిపట్టుకొన్న
వాడు, ఇవ్వాళ ఇంకేమైనా చేస్తాడు. అసలు నిన్ననే, ఆయన
కీ సంగతి చెప్పాలిసింది; తనెందుకో చెప్పలేకపోయింది. ఉరు
మురిమి, మంగలంమీద పడుతుందేమోనని తన భయం!
చెప్పకుండా ఉంటే ఈ మూర్తిగాడు ఇంకెంతదాకా పాకుతా
డోనని, అదో భయం! అయ్యో శ్రీరామచంద్రా!

లలితకు హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది. అలాంటి
ఆలోచన సమయానికి వచ్చినందుకు, ఆమె చాలా సంతో
షించింది. ఈగిజాటునుండి తప్పుకోవడానికి తన కదొక్కటే

మార్గం! తనకూడా పుట్టింటి కెళుతుంది. దానితో అన్ని చిక్కులూ ఇట్టే విడిపోతాయి. తన కిక మూర్తిగాడి బెడద ఉండదు. వీణ్ని గురించి తను నుల్లగుల్లాలు పడనవసరం లేదు. ఇక్కడ ఉండడం, అన్నివిధాలా అనర్థకమని తేలిపోయింది. ఉన్నప్పణ్నించీ, ఈ మూర్తిగాడు ఏదో చేస్తూనే ఉంటాడు. ఇలా ఇలా చేస్తున్నాడని, ఈ మనిషికి చెప్పడానిగ్గూడా లేదు. మొదట్లో, ఆయనగారి కంతగా ఇష్టంలేకపోయినప్పటికీ– ఈ తింటి ఏర్పాట్లు చేసింది తనే; ఇప్పుడు వద్దంటున్నదీ తనే!

అదీగాక వీడు తనను 'అమ్మాయ్' అంటున్నాడు. తను వీణ్ని 'అన్నగారూ!' అంటున్నది. అటువంటివాడు ఈ పనిచేశాడంటే ఎవ్వరూనమ్మరు. పైగా తనే రద్దీపడాలసొస్తుంది. ఇక్కడుండి, ఈ జాతర నెత్తికి చుట్టుకోడంకన్నా, తను హాయిగా తప్పుకెళ్ళడమే మంచిది! నాన్నకూడా మొన్ననే రాశాడు. ఆయనరాశాడనికాదు గానీ, తనకుగూడా తనవాళ్ళను చూడాలనిపిస్తున్నది...... అన్నిటికన్నా ముఖ్యం ఈ గండకత్తెర తప్పిపోతుంది.

శంకరం భార్య చెప్పింది విన్నాడు. ఓ నిమిషం ఆలోచించాడు. ఆ తెల్లవారే అతను భార్యను ప్రయాణంచేసి బండిదాకా పంపించాడు.

నాలుగైదు రోజులపాటు చాలా కులాసాగా గడచిపోయింది. లలిత తన స్నేహితులందర్నీ పలకరించి వచ్చింది. ఆ పైన ఏం చెయ్యవలసిందీ లలితకు తెలియలేదు. ఇంట్లో ఉన్న కాసినిపుస్తకాలూ, పనిబట్టి రెండురోజుల్లో పూర్తిచేసింది. ఈ ఊళ్ళో సినిమాలు, పార్కులు లేవు. రేడియోగూడా లేదు.

ఆమెకు పిచ్చెక్కినట్లయింది. ఓ నెలరోజులపాటు కులాసాగా గడుపుదామనుకొంది. వారానికే మొఖం మొత్తింది! తిరిగి వెళ్ళిపోదామా అని కూడా అనుకొంది. మరో రెండురోజులు రాజారావు రాకపోతే, అనుకొన్నంత పనీ చేసేది లలిత.

రాజారావును చూడగానే లలితకు పాత సంగతులెన్నో జ్ఞాపకం వచ్చాయి. ఆవిడగారు కథానాయిక కాదు గానీ, అయినట్లయితే, తప్పకుండా కళ్ళంట నీళ్ళు పెట్టుకునేది. ఆ రోజుల్లో, తెలిసీ తెలియని వయస్సులో, తామేమో అనుకొన్నారు. పెళ్ళికూడా చేసుకుందా మనుకొన్నారు. ఈ భూప్రపంచం తల్లక్రిందులైనా, సూర్య చంద్రులు గతులు తప్పినా, సప్తసముద్రాలూ ఇంకినా, తమ వివాహం జరిగి తీరాలిసిందేనని ప్రమాణాలు చేసుకొన్నారు. చివరికి జరిగిందేమిటంటే ఏమీలేదు. మొదట్లో ఏదో కాస్త గినుకులాడినా, తను శంకరాన్ని చేసుకుంది. రాజారావు ఇంకెవర్నో పెండ్లాడి ఉద్యోగం చేసుకుంటున్నాడు. అంతవరకూ తన పెళ్లి విషయం, అట్టే పట్టించుకోని నాన్న, ఈ సంగతి తెలియగానే ఆదరా బాదరా కానిచ్చేశాడు. అమ్మ ఒప్పుకోలేదు గానీ, ఒప్పుకొంటే తన పెళ్ళి రాజారావుతోనే అయ్యేది...

లలిత ఆశించినంతా జరిగింది. రాజారావు ఆమె కాలక్షేపానికి చక్కగా అక్కరకొచ్చాడు. దివాణంలాంటి కొంప, నాన్న ప్రొద్దుటనంగా వెళ్ళి రాత్రిగ్గానీ తిరిగి రాడు. తమ్ముడు, ఆ వీధి బడితో సతమతమవుతుంటాడు. ఆ రెండు మెతుకులూ ఉడకేసి, అమ్మ ఓమూల నడుంవాల్చేస్తుంది...

రాజారావుక్కూడా, ఆనాటి సంఘటనలన్నీ మనస్సులో

మెదిలి ఉండాలి; లేకపోతే, అలా మాట్లాడి ఉండడు మరి.

'ఆఁ పోనిద్దూ! అప్పు డేదో జరిగిపోయింది. దాన్ని గురించి ఇప్పు డెంత అనుకొంటే మాత్రం ఏం లాభం?' అన్నది లలిత.

'నేనంత తేలిగ్గా మాట్లాడలేను. నువ్వు మరచిపోయా వేమోగాని, నే నింకా మరచిపోలేదు.' అన్నాడు.

లలిత కళ్ళు తళతళలాడాయి.

'ఈగదిలోనే మనం కలుసుకొంటుండేవాళ్ళం. మొదటి సారి నిన్నిక్కడే నేను ముద్దెట్టుకొన్నాను...'

లలిత అతని ముఖంలోకి చూసింది. ఆమె పెదాలు కొద్దిగా వణికాయి ఏదో చెప్పబోయి చెప్పలేక ఆగిపోయింది. రాజారావు కేదో ప్రోత్సాహం లభించినట్లయింది. ఎవరో చెప్పినట్లుగా, అతను ముందుకు వెళ్ళాడు. అతని చేతుల్లో లలిత శరీరం, ఓ క్షణం పెనుగులాడి, మానేసింది...

తాను చేసిన ఈ పని మంచిదా, చెడ్డదా అన్న విచికిత్స జరిగినప్పుడు, మంచిదేనని లలిత సమాధానం చెప్పు కొంది. తనూ, రాజారావూ ఒకప్పుడు పెళ్ళికూడా చేసు కొందా మనుకొన్నారు. చేసుకోవడానికి తమకు అభ్యంతర మేమీ లేదు. చేసుకోవటమే జరిగినట్లయితే, తను శాశ్వ తంగా, రాజారావుమనిషి అయివుండేది. అలా కాకపోవ డానికి కారణం, తనుగానీ, అతనుగానీ కాదు; అమ్మ! ఆమె పట్టుదలవల్లనే తాము విడిపోవలసివచ్చింది. అమ్మ ఒట్టుబట్ట నట్లయితే, తా మిద్దరూ భార్యాభర్త లయ్యేవారు. హాయిగా సుఖించేవారు. ఇప్పుడు కాలేదు—అయినంత మాత్రాన

సుఖపడకూడదనే దేముంది? నిజం చెప్పాలంటే తను వ్యభిచ రించింది శంకరంతోనే గాని రాజారావుతో కాదు!

ఈ పంపిణీమీద, తనను తాను సమర్థించుకొందుకు చాలా కారణాలు కనిపించాయి లలితకు ఆ మూర్తిగా డీలా చేయడం కూడా, ఒకందుకు మంచిదే ననిపించిందామెకు. లేక పోతే, ఇంతలో తను పుట్టింటికి వచ్చి వుండదు, ఈ రాజారావు కనుపించనుకూడా కనిపించడు. అంచేతే, ఇతని సెలవు అయి పోయిందాకా తనిక్కడే ఉండటానికి నిశ్చయించుకొంది. మరో పదిహేను రోజులదాకా, రావడానికి పడదని, శంకరానికి ఉత్తరం కూడా రాసింది.

అయితే ఆ గడువు దాకా లలిత ఉండ లేదు. అలా ఉత్తరం రాసిన మూడో రోజునే ఆమె ప్రయాణంకట్టింది. ఇంత హఠాత్తుగా లలిత ఎందుకు ప్రయాణమౌతున్నదో ఎవ్వరికీ తెలియలేదు. చివరకు రాజారావు కూడా తెలుసుకో లేకపోయాడు.

'నువ్వింకా ఉంటావనుకున్నాను లలితా! ఇలా వెడతా వనుకోలేదు. కనీసం ఎందుకెడుతున్నావో కూడా నాకు తెలియ కుండా వుంది' అన్నాడు రాజారావు.

'తెలియవలసిన అవసరం లేదు' అన్నది లలిత.

ఆమె మనస్సు పరిపరివిధాల పోయింది. ఈ మొగవా ళ్ళంతా ఇంతే అనుకొంది. ఎంతో ప్రేమించాడను కొన్న ఈ రాజారావు కూడా తనను మోసగించాడనుకొంది. ఆనాడు— పెళ్ళికాక పూర్వం—పెళ్ళి చేసుకొంటానననే, తనను అనుభ వించాడు. ఇప్పుడు—భార్య పుట్టింటికి వెళ్ళిన కారణంగానే

వెనుకటి పరిచయాన్ని పురస్కరించుకొని, తనను మరొకసారి 'పతిత' ను చేశాడు ఈ రెండవ తప్పు జరగడానికి కారణం తను కాదు; రాజారావు భార్య.

ఆలోచించి చూడగా లలిత కెన్నో అనుమానా లుద యించాయి. ఈ ఆలోచన, అక్కడ ఉండగానే వచ్చినట్ల యితే. తను పుట్టింటికి రానేరాదు. ఓ అపాయంనుండి, తప్పి కొందుకు తనిక్కడ కొచ్చింది; అంతకన్నా బలీయమైన అపా యానికి గురికాబడ్డది. ఈ రాజారావు ధర్మమా అంటూ తనకు తెలిసివచ్చింది. రాంమూర్తి తనవెంట .పడటానికి, రాజాగావు తన దరిజేరటానికి గల కారణమేదో తనకు తెలిసిపోయింది! బహుశా ఈ కారణంచేతే తనభర్త, తను పుట్టింటికి వెళ్ళడానికి, చప్పున అంగీకరించి వుంటాడు.

తను త్వరగా వెళ్ళాలి. తనభర్త మరో స్త్రీ వలలో పడకముందే. ఆయన్ను రక్షించుకోవాలి. ఇష్టాయిష్టాలనేవి ఎట్లా ఉన్నా, తను చేసేచేసే కాపరాన్ని కాలదన్నుకో లేదు...

ఆదరాబాదరా రైలు దిగి ఇంటికొచ్చింది. రాం మూర్తిగారి భాగంలో దీపంకూడా లేదు. తను యింట్లో నుండి గాజుల చప్పుడు వినిపించింది. అడుగులో అడుగు వేసు కొంటూవచ్చి తలుపుసందుగుండా లోపలికి చూసిందామె. లలిత అనుమానించిందంతా జరిగింది. శంకరం వెల్లకిలా పడుకొనివున్నాడు. అతని మంచంమీద కూచున్నామెను శారదగా గుర్తుపట్టడానికి, లలితకు ఎంతోసేపుపట్టలేదు.

# నీతి స్తంభం

భూమిమీద ఆగస్టు మబ్బులనీడలు అందాలుగా నడుస్తున్నాయి. తొరతొరగా చెదురుతో, చల్లగాలి మెత్తగా నీడల్ని తాకుతో వచ్చి, గదిలోవస్తువుల్ని చికాకుపరుస్తున్నది. మిత్రులందరూభోజనాల అలసటతో సిగరెట్లు కాలుస్తున్నారు. కూతురు నామకరణ మహోత్సవానికి నాగభూషణం యింటికొచ్చారువాళ్ళు. నాగభూషణం చలమిస్టు చలానికిమల్లేనే. అతనుకూడ కూతురుకు దేనికీ అందని పేరుబెట్టాడు. అతన్ని చూస్తే రచయిత సుబ్బారావుకు పెద్దకోపం. పనిగట్టుకొని నాగభూషణం అతనికి కీడుఅనేది ఏమీ చెయ్యలేదు.

అసలు 'చలం' అంటే సుబ్బారావుకు మంట. వాడి మూలంగా సమాజమంతా నాశనమవుతోందంటాడు. ఆడవాళ్ళు చంకల్లోకి రవికలు కుట్టించుకున్నా, కడియాలు, అందెలు తీసిపారేసినా, సన్నటి గరగరచప్పుళ్ళ చీరెలు తొడలుకనపడేటట్టు కట్టుకున్నా, చలమే కారణమని, అంతటితో ఆగక సినిమాలో యిటీవల సెక్సుఅప్పీలు డాన్సులుచెయ్యడానికి, రేడియోలో, గ్రాంఫోనులో, పత్రికల్లో ప్రేమపాటలు, తుమ్మెద, కోకిల, చల్లగాలిపాటలు పాడటానికి చలంగాడు కారణమంటూ, అసలు ఆడవాళ్ళను చూడగానే భక్తిపుట్టకుండా, మొగవాళ్ళకు కామంపుట్టడంకూడ, వాడుచేసిన అఘాయిత్యమేనని ముగిస్తాడు, సుబ్బారావు.

సుబ్బారావు రచనలను ప్రకటించేపత్రికలు తెలుగులో వ్యంషషం, ఆంధ్ర నీతివంతుల సంఘు పురాజన్మ సుకృత విశే

షం. చలాన్ని అతనిని, లోలోపలకాక, బహిరంగంగా పొగిడే బహుకొద్దిమంది తెలుగువాళ్ళను పత్రికల్లో చీలుస్తూ, రక్త పాతాలు జరుపుతూ రచనా పరంపరలు తెలుగు లోకంలోకి కార్చాడు సుబ్బారావు.

'ఇదిగో! చూశావా, "పిలక" పత్రికవారి జన్మదిన సంచికలో "చలం మలం" అని ఒక కథ రాశాను. ఈపత్రిక-వాడిగ్గూడ ఒకకాపీ పంపాలే! ఇది చూసినతరువాత చలం ఆత్మహత్య చేసుకొంటాడని నా నమ్మకం;' అన్నాడు సుబ్బారావు చేతులో పత్రిక బల్లమీద పడేసి.

"యేమని రాశావు?" అన్నారొకరు.

"మామూలేగా! భావాలను అంగీకరించే ధైర్యంలేక, ఆ క్రెడిట్‌ని శైలికీ, వర్ణనలకూ, రచనా పాటవానికీ అంటగడతాడు" అన్నాడు నాగభూషణం.

"ఇది చదువు ముందు, తరవాతమాట్లాడు"

"వొద్దు, చలంమీద విమర్శలు చదివిచదివి తలనొప్పి పెడుతోంది. మామూలు ఏడుపేగా! సంఘం పాడై పోతోంది. యివి చదివిన తర్వాత ఏ ఆడదీ మొగవాడితో కాపురం చెయ్యదు. లేచిపోతారు సంసారాలు వదిలి—ప్రజలు నైతిక పతనం అవుతారు......మామూలు ఏడుపే. కొత్తకంఠాల్లోంచి తప్ప మార్పులేదు, ఆనాడు, యీనాడు, ఎవరినుంచైనాసరే చివరికి.

"కాదంటావా? నన్నడిగితే అసలు ప్రజలు ఇంత బరి తెగించిపోవటానికి, వాడు కారణం, ఎట్లాకాదో చెప్పు?"

"నిజంకావొచ్చు చలాన్ని సరిగ్గా అర్థంచేసుకోనివాళ్ళకు.........నువ్వేం చదివావు అతనిసాహిత్యం అతన్ని తిట్టటానికి?"

"మొదట 'పాపం!' చదివాను. అప్పుడే నా మనస్సులో పలికింది ఈ పురుగును ఆంధ్రులు బతకనివ్వటం ఎందుకా అని? అప్పణ్నుంచీ......"

"అట్లాచెప్పు. అందుకే అతను నీ కోపానికి కారణం అయ్యాడు. మొత్తంసాహిత్యం చదువు; నీబోటి పిచ్చినాన్నల కోసం అనంతంగా బాధలుపడటం, ఘోష వినిపిస్తాయి."

"వొద్దు, ఎంతరాసినావొకటే! కామం, కామం, ప్రేమ, ప్రేమ, శృంగారం, నరాలతీపు, తియ్యనిబాధ, లేచిపోవటం— అంతేగా! లేచిపోయినవాళ్ళ చరిత్రలుతప్ప అతగాడికి మరొకటి కుదరదు రాయటానికి! ఇంతేనా జీవితమంటే! ఒక్కచోటైనా తిండినిగురించి రాశాడా? అతనుతిట్టే, విమర్శించే వ్యవస్థ అసలు ఎందుకొచ్చినయ్యో ఆలోచించాడా? రోగచరిత్ర తెలీకుండా మందులువాడే డాక్టరుకీ చలానికీ ఎక్కడుంది భేదం?" అని ఆయాసంవల్ల ఆవేశంతో ఆగిపోయినాడు సుబ్బారావు. విజయాన్ని సాధించినట్లు మొఖం చాటంత విస్తరింప చేసుకొని అందరివంకా చూసి—————

"వుండు. నువ్వన్నట్టు చలంగారికి లేచిపోయేవాళ్ళ చరిత్రలుతప్ప రాయటానికి కుదరదేమో. అతను వేసిన మహాస్త్రాలు సంఘానికెక్కడా తగలనిమాట నిజమే నీ మాటప్రకారం——మరి నువ్వు చలంమీద దండెత్తడందేనికి? 'పిలక'—'తిరుమార్నం' —— 'మూడులింగాలు' —— 'పతివ్రత' —— పత్రికల్లో

నీఏడుపు, నీఅనుయాయుల ఏడుపులెందుకు? చలంమూలంగానే సమాజమంతా నైతికపతనం అయిందని అఘోరిస్తారేం, మీ అన్నయ్యలు, తమ్ముళ్లు? చలంవేసిన ఆగ్నేయాస్త్రాలు సంఘాన్ని కించిత్తయినా కదలించనపుడు! వాడివల్లనే కుర్ర వాళ్ళు, కుర్రవతులు 'బరి' తెగించిపోతున్నారనీ, కాపరాలు చెయ్యటంలేదనీ, లేచిపోతున్నారనీ రంపరిల్లటం దేనికి?......

"అదీ ........" అని నసిగాడు.

"విను, అతని రచనలు సంఘంలో యిప్పుడిప్పుడే కదలిక ను తీసుకొస్తున్నాయి. అది మీ రచయితలు అందరివల్లా కానిపని. ఆ క్రెడిటు అతనికివ్వటం ఇష్టంలేదుమీకు. అందువల్ల అతని సాహిత్యశరాలు సంఘానికెక్కడా తగల్లేదని కాసేపూ, భయంకరంగా గాయాలుచేసి ప్రజల్ని దిగజారుస్తున్నాయని కాసేపూ, నిలకడలేకుండా మాట్లాడి కొట్టుకుచస్తున్నారు మీలోమీకే కుదరక తిట్టడం—" అన్నాడు నాగభూషణం.

"అబ్బే! కాదు. చలం గొప్ప రచయిత. అమోఘమైన శైలి. బ్రహ్మాండమైన భావవేగం. గొప్ప రచనా నైపుణ్యం ......కానీ...... ఆబూతునుగురించి రాయటముంది చూశావూ......అది మానుకొంటే......

"బూతునుగురించిరాయటం మానుకోమని వొకరచయితని బ్రతిమాలుకోటంకన్న — అసలు బూతే జరక్కుండా, ఎవ్వరూ లేచిపోకుండా, లేచిపొయేవాళ్ళకు మీరంతా వెళ్ళి అడ్డంపడరాదూ? ఇట్లా, ఇట్లా, ఈ యీ కారణాలవలన లేచిపోతున్నారని రాయటమూ చలంతప్పు! జరుగుతున్నయ్ గనక రాస్తున్నాడు."

"మాంసం తింటామని ఎముకలు మెళ్ళో వేసుకోవడం...."

"మీరంతా 'తప్పు' అనుకొంటున్నది తప్పుకాదని చెప్పటానికే చలం అంత తప్పుగా రాస్తున్నాడేమో నువ్వెప్పుడన్నా ఆలోచించావా?"

"అదిసరే! మరి కథల్లో ఎక్కడా 'తిండి' సంగతి వుండదేం? అన్నంలేకపోతే ప్రేమవుంటుందా మనుష్యులమధ్య? దీనికేం చెబుతావు?"

"మహాభారతంలో బాడ్మింటన్ గురించి లేదనటంలో ఏం అర్థముంది? ఆయన తోవ వేరు. అందులో దీనిసంగతి అప్రస్తుతమని భావించివుండాలి. ఆమాటకొస్తే, నీ సవాలుకు నీవ కథల్లో తిండీ, గుడ్డ, ఏడుపులు, నెత్తురుతప్ప మిగతావి వున్నాయా? ఆ కథానాయికా నాయకులంతా వుచ్చులు బిగించుకొన్నారా? వాళ్ళకి ఎక్కడా సెక్సువుండదేం? ఎందుకంటే ఆ కథలు నీతివిగనక. అంతే చలంలోనూడా!"

"నువ్వేన్నన్నా చెప్పు. జీవితమంతా సెక్సుమయం అనటం శుద్ధపొరబాటు. చలం శాస్త్రనయం. మరీ యిటీవల వానముతాబయలుదేరింది. వీళ్ళు అన్నాచెల్లెళ్ళ మధ్యగూడ ప్రణయంనడిపి పైగా అదంతా రైటేనని వెధవఫిలాసఫీ దంచటం— పసిపిల్లల్లోగూడ సెక్సువుంటుందనీ, అయితే అదిపెద్దవాళ్ళకమల్లేగాకుండా మరొకరూపంలో వ్యక్తమవుతుందనీ రాతలు పత్రికల్లో......"

సుబ్బారావు యిట్లాఅంటున్నాడు. ఆవేశంతో వెనక్కీ ముందుకువూగుతో, మధ్యమధ్య రతయితలను తిడుతో. వసా

రాలోనుండి సుశీల పెద్దగొంతూ,కిష్టుడిపీపుమీద ఫెటఫెటలూ, వాడిఏడుపూ వినిపించినై.

" ఏమిటోయ్ ఆగాడవ? ఎందుకు వాణ్ణట్టాకొట్టడం?" అంటూ నాగభూషణం వసారా వేపుకు వచ్చాడు.

"కొట్టాలా? నరకాలా వీణ్ణి? వేలెడు లేని వెధవగ్గూడ... అన్నీ వెదవబుద్ధులు..." అని మరొకటి కిష్టుడిపీపుమీద అంటించి...... "ఈదఫా వాళ్ళింటి వేపు వెళ్ళు, చర్మం వొలుస్తా" అని ఇంట్లోకిపోయింది. నాగభూషణం కుచ్చెళ్ళతో కిష్టుడిచీమిడి, మసికన్నీళ్ళుతుడిచి ఎత్తుకొని మళ్ళీ స్నేహితుల దగ్గరికివచ్చాడు. కిష్టుడు, తండ్రిచంకలో యేడుస్తూనే వున్నాడు యింకా.

"ఏంచేశావు నాన్నా?"అని బుజ్జగించాడు కొడుకుని నాగభూషణం.

" మరే......నేనే......చిట్టినే.......రోటిచాటునే ......మొగుడూపెళ్లాలఆట ఆడుకొంటూంటేనూ ...... కొట్టింది నాన్నా."

" ఓస్. దీనికేనుటోయి ఏడవటం —— వూరుకో. బిస్కట్లు ఆనిక్కొనుక్కొని అమ్మకు పెట్టకుండా——మని ద్దరం—తిందాం.—సరేనా—? వూరుకో"

"ఆనిక్క.........నువ్వు.........అమ్మని........ కొట్టు నాన్నా!"

తండ్రిదగ్గర వాగ్దానం తీసుకున్న కాసేపటికి ఏడుపు ఆపుకొన్నాడు కిష్టుడు.

అందరూ వాళ్ళమామూలు ధోరణిలోపడ్డారు.

"ఈ ఏమిటి? యిందాక ఏదో పిల్లలంటున్నావే?"

"ఏం లేదు" అన్నాడు సుబ్బారావు ఈసంఘటన జరిగిన తర్వాత ఏమనాలో బోధపడక. విషయం మార్చాడు.

"అయినా తిండికిచ్చినంత ప్రాధాన్యం సెక్సుకివ్వటం మంచిదిగాదు. వారంరోజులు తిండిలేకపోతే మనిషి చస్తాడు. నెలరోజులు సెక్సు లేకపోయినా హాయిగావుంటాడు. సెక్సు చెప్పుకోదగ్గంత సమస్యగాదు."

"సీతాపతి లక్షాధికారి..."

"ఏ సీతాపతి?"

"గోవర్ధన మిల్ ప్రొప్రయిటరు."

"ఓ"

"లక్షాధికారి. మొఖమల్ పరుపులు, కార్లు, గౌరవం, సొమ్ములు, మంచి ఆహారం, చేతినిండా రూపాయలు ఏం తక్కువ సీతాపతిభార్యకి? అత నో గొప్పరసికుడు. ఖాదిర్ తో ఎందుకులేచిపోయింది? మిల్లులో బస్తాలు మోసేకూలివాడు. తిండిగూడా వుండదు వాడికి. తాగుతాడు. రౌడీ. జూదగాడు. ఏంచూసివాడిలో? సీతాపతి ఎంతబతిమలాడినా వొచ్చిందా? వాడితో తన్నించుకుంటూ, అన్నంలేక అరుగులమీదనైనా వుండటానికి వొప్పుకొందిగాని. డబ్బుకారణం అయినా అంతకంటే ఇతర 'యిన్ స్టింక్ట్స్' చాలా పనిచేస్తుంటాయి జీవితం మీద."

"నీమాటలు వింటుంటే జవాబురాదు చెప్పటానికి. కాని——ఈ సాహిత్యంవల్ల ప్రజలు చెడిపోతున్నారని నా నమ్మకం."

"చెప్పాగా యుందాక. మళ్ళీ మొదలా?"

'ఈ పీడ చలంతో పేటే ఆఖరనుకొన్నాను. కాకుండా యువక రచయితలదాకా పాకింది. ఇంతమంది ప్రాణాలతో బతికుండగా యిక సంఘం బాగుపడే దెట్లా?''

"ఎందుకు వీళ్ళనుచూచి భయపడటం? మీ స్త్రీలంతా పతివ్రతామణులుగా! పరపురుషుడొచ్చి కావిలించుకొన్నా కామం రేగదుగా? తరతరాల, యుగయుగాలనుంచీ పతివ్రతా ధర్మాలకు, సతీత్వానికి మీ స్త్రీలు ప్రపంచం మొత్తం పేరు మోశారటగా? అన్యపురుషుని అన్నయ్యలాగానో, బాబాయిలాగానో తప్ప మరొకవిధంగా అనుకోవటం చాతగాద నేగా మీవాళ్ళంతా పుస్తకాల్లో రాసింది, మీరీనాటికీ మనస్సులో-ఎట్లావున్నా పైకి అంటోన్నదీ. ఇంత మంచివాళ్ళ మనస్సుల్ని ఈ కొంచెం రచనలు ఏంజేస్తాయి? తెలుగు దేశం మొంత్తలోకి వీళ్ళేగా కాస్త ధైర్యంగా బూతుకథలు రాస్తున్నది. వీరుదప్ప మిగతా రచయితలందరు మీవాళ్ళేనాయె. నీతికథలు, నీతి పాటలు, నీతివ్యాసాలు, నీతిబూతులు రాస్తారాయె.యింతమంది మహాయోధులు, కలాయుధాలు తీసుకొని, తెలుగుస్త్రీల పవిత్ర మానాలను లక్షకళ్ళతో కాపలాకాస్తోంటే, ఏం,ఈనలుగురు బూతుకథలు రాస్తే? ఏంపోయింది? వీళ్ళదుర్మార్గ మీ ఆడ వాళ్ళదాకా రాకుండా మీరు నీతికథలురాసి వాళ్ళను అణచాలని చూస్తూనేవుంటిరి. ఎందుకు భయం?''

" నాబోటి పట్టుగొమ్మలు. వూడలు. వుండబట్టె సంఘం కాస్త ఆగింది. లేకపోతే ఎప్పుడో పులుసులో కలిసిపోయేది,''

"ఈయువకరచయితల శక్తిని ఒప్పుకోలేక ఏండ్రొంకతిరుగుడు రా బ్రదర్!" అన్నాడు నాగభూషణం పకపకనవ్వి.

ఇటాగా మిత్రులందరూ చర్చిస్తున్నారు. వాళ్ళలో చాలామందికి చలంమీాద లోలోపల ఆరాధనలు పలుకుతుంటాయి. చాలగొప్పగా జీవితాన్ని తరించి, ఊహించి అందరూ పైకిఅనడానికిభయపడేవి ధైర్యంగాఅంటాడని, రాస్తాడని, రాసినవి ఆరాధిస్తాడని. వీళ్ళలో మళ్ళీ రెండుతరహాలు.

"వాడు ఎట్లాచస్తేమనకేం? వెధవరాతలురాసి అందర్నీ చెరుపుతున్నాడు.'

"రాతలు ఎట్లావుంటేనేంగనక—రాసిందంతా ఆచరించి చస్తాడు."

చలంగారూ మీాఖర్మం!

ఎండతగ్గింది. సాయంత్రపు నీడలు పొడుగ్గా ఎదుగుతున్నాయితూర్పు వేపుకి.అంతా లేచారు.సుబ్బారావుకుదోవలో కొత్తకొత్తఆలోచనలు కొత్తకొత్తవాదనలు, ఎత్తులు స్ఫురిస్తున్నాయి. ఇవన్నీ యిందాక, నాగభూషణంతో వాదించేటప్పుడు ఎందుకు గుర్తురాలేదా అని విచారించాడు. సమయం చూసుకొని నాగభూషణాన్ని వాడి అభిమానరచయితల్ని బూడిదచేసిపారెయ్యాలనుకొన్నాడు. అట్లా అనుకొంటూనే యింటికొచ్చాడు.

తలుపులు దగ్గరగా వేసివున్నాయి. తీసుకొనిలోపలికెళ్ళి, చొక్కా వొంకెకుతగిలించి భార్యను మంచినీళ్ళడిగాడు. పార్వతమ్మ పలకలేదు.

"దీనిబొంద భక్తి. ఎప్పుడూ జపాలే. ఎప్పుడూ తావళం తిప్పటం, తులసిపూజలు, నోములు—పిడికిపప్పడు కాసిని మంచినీళ్ళిచ్చే దిక్కులేదు" అంటూ వంట్లోకెళ్ళాడు. ఎక్కడా పార్వతమ్మ కనిపించలేదు. వంటింటికడపమీద కాయితం మడతబెట్టి పైన గరిటె బరువుబెట్టివున్నది. సుబ్బారావు ఆత్రంగా కాగితంవిప్పి చూడసాగాడు.

ఏమండీ!

"నేనుచాలా కాలంనుంచి చూస్తున్నాను. నేననుకొన్న మార్పురాలేదు. మీకథలు, వ్యాసాలు, వాదనలు విన్న తరువాత యికముందువొస్తుందనే ఆశనుకూడా చంపుకొన్నాను. తొలిరోజుల్లో 'ప్రేమ' గా వున్నది కాస్తా మీ అలుపువల్ల 'నీచం' గానూ, 'తుచ్ఛం'గానూ మారిపోయింది. యిది గ్రహచారం! మీరు మంచితిండి బెడుతున్నారు. ఖరీదుగలగుడ్డలు, సొమ్ములుతగిలించారు. పదిమందిచేత గౌరవంచేయించారు. కానీ మానవజీవితం యింతటితో ఆగిపోతుందనిభ్రమిశారు. ఈపదార్థాలన్నీయిచ్చే ఉద్దేశాలసంగతి మీరువొదిలేశారు. తిండిదిని నిశ్చేతనవస్తువులకుమల్లె మనుషులు పడివుంటారని; మనిషిఐననీారు ఎట్లావూహించారో నాకు తెలియటంలేదు. ఒకసారి అనుభవాన్నిరుచిచూచిన తర్వాత మానుకోవటం ఎంతకష్టమో మీకు తెలియలేదనుకుంటాను. ఒక వేళ తెలిసినా, తెలియనట్లు నటిస్తున్నారేమో మరి నాకు తెలియదు.

పనిపాటలతోనూ, యింటిచాకిరీతోనూ సతతమతమవ్వే మనిషికి కామంవుండడం సంభవంకాదని మీరునిర్ణయించుకొన్నట్లు స్పష్టమైంది. అందులోనాభక్తిజపాలుచూసి

మీనిర్ణయానికి బలంసంపాదించుకొనివుంటారు కానీ, విషయ మేమిటంటే——నామనస్సును ఎప్పుడూ మీముందు విడమ రచి చెప్పలేదు. మీకంటేముందుగానే కామాన్ని ప్రకటిస్తే నన్నుతప్పుడుగా అర్థంచేసుకుంటారేమోనని భ్రాంతిపడ్డాను.

మీకు తెలుసనుకొంటాను - ఆబూతుకథలురాసే కృష్ణ మూర్తి——అతనితోపోతున్నాను. అతను బీదవాడని తెలుసు నాకు. అయినా యిష్టం. నన్ను వెదుక్కుంటూ మీరు రాన క్కర్లేదు. కనీసం నాకోసం మీరుప్రయత్నాలు గూడచెయ్య టం అనవసరం. హాయిగాకాయితాలమీద స్త్రీమానరక్షణ చేస్తూ బతకండి. అయినా మీకథలప్రకారం మీకు స్త్రీ పనికి రాదుగదా. కామం వుండగూడదుగా మరి. చిక్కులేదు. నీతి రచనలుకార్చుకొంటూ సంతోషించండి — మృగప్రాయమైన పశుప్రాయమైన——అనాగరికమైన ఆ కామంలోపడి నే కొట్టుకపోతాను."

పార్వతమ్మ వ్రాలు.

——◆——

# అనుమానం

నాగరాజు భార్య పుట్టింటికి వెళ్ళి నాలుగునెలలు గా వొచ్చింది. వెంకాయమ్మ ఇంతకాలంఎందుకు పుట్టింట్లోవుందో నాగరాజుకు అర్థంగాలేదు. తమ్ముడిపెళ్ళికని పోయిన మనిషి వెంకాయమ్మ తమ్ముడి అత్తగారింట్లో అరణంతినడంగూడా అయిపోయి పదిరోజులయింది. నాగరాజు అయిదారు కార్డులు రాశాడు మామగారిపేర. భార్యకుగూడా రెండు ప్రేమలేఖలు రాశాడు విరహసందేశాన్నినింపి. మనుషుల్నిగూడా పంపించాడు. ఏమీ లాభంలేకపోయింది. వాళ్ళు దేనికీ సమాధానం చెప్పలేదు. కనీసం 'పిల్ల'ను పంపుతామనో, పంపమనోగూడా చెప్పరు.

నాగరాజు ఇంతపని చేశాడుగానీ తనుమాత్రం భార్యను తీసుకొచ్చిందికి వెళ్ళలేదు. పాపం నాగరాజు వెళ్ళలేదు వాళ్ళయింటికి. కార్యమయిన తొలిరోజుల్లో 'భార్య' కోసం తెగ తిరిగాడు నాగరాజు. తొలిరోజుల్లో అత్తమామలకు అది ముద్దుగానేవుంది. కూతురూ, అల్లుడూ, ఎప్పుడూ గది విడకుండా వుంటుంటే వాళ్ళు గదిలో వున్నట్టేఅనుకొని సంతోషించారుపాపం! అంతటితో నాగరాజు ఆగిపోయినట్లయితే ఎంతో బాగుండేది!

ఒక రోజు నాగరాజును వాళ్ళత్త అడిగింది.

"ఏం నాయనా వూరికే కూచున్నావు. ఇంటిదగ్గర పనీ పాటా ఏమీ లేదా ఏమిటి? ఇట్లావుంటే ఎట్లా జరుగుతుంది బాబూ మనబోటోళ్ళకి" అన్నది.

నాగరాజుమామ భార్య మీద చిచ్చుబుడ్డికిమల్లే మండిపడతాడు అల్లుడిముందు.

"ఎక్కడ చచ్చేదే నీ నోరుబడ? ఎంతడబ్బు తెచ్చినా మీ బొందలు పోడుగుచెయ్యడానికే చాలడల్లేదాయె. తే. తే. తే. ఎక్కణ్ణించి తెచ్చేది? పదిరోజులు గాలేదు వీసెడు నెయ్యి తెచ్చి. అప్పుడే తెప్పాళాకడిగి చేతికిస్తివి. అరబస్తా బియ్యం వారం రోజులన్నా రాంది నన్ను దేంటోనన్నా దూకి చావమంటావా? వుప్పులేదు, పప్పులేదు, నూనెలేదు, చక్కెర లేదు, కాఫీగుండలేదు. లేదు. లేదు. లేదు. ఏమీలేదు, లేదనే మాటతప్ప. నీబొందలో నినుదాస్తే వున్నదీ అన్న అక్షరాలే నీ నోటంట రావాయె! మరి నీ నోరేంనోరో! నీ నోట మట్టి గొట్ట......అదికాదు నాగరాజూ! సంసారమన్న తరవాత... ఎందుకులే నాయినా! ఇదంతా నా ఖర్మ! ఈ కష్టాలు. ఈడబ్బు, ఈ పిల్లలు, ఈ పెళ్ళాంతో చస్తున్నాను. నా గడ్డ నేను తిని ఎదుటిదానికి చెయి చాపుతున్నానంటే నమ్మా. ఇదంతా నా ఖర్మ, ఖర్మ!" అన్నాడు నాగరాజు మామ.

"ఇది మరీబాగుంది. ఆడలేక మద్దెలమీదబడి ఏడ్చినట్టు మీరు నామీదబడేడుస్తారేం! వీసెడు నెయ్యి నా బొందకేసి కొట్టుకోలా. అందరి బొందలకూ కొట్టాను. అర బస్తా బియ్యం వారంరోజు లెట్లావ... అందరూ ముమ్మాటికి పొట్టపగలకొట్టుకు నేవాళ్ళేనాయె! వుప్పు, పప్పు అయిపోతు న్నాయంటే అయిపోవూ? నీ పెద్దకూతురుకు యిన్నేళ్ళొచ్చి నయ్. ఈనాటికీ అది అలమారాలు పగలగొట్టి తినటం మాన లేదు. నీ రెండోకూతురో, అదొకటి తిపాచిముండ, బైలుకెళ్ళే

చెంబులో బియ్యాలు, పప్పులు బోసి అమ్ముకుతింటుంటే ఎట్లా వస్తయ్? వాళ్ళనేమీ అనలేక నామీాద విరుచుకుపడతావేం? అల్లుడికన్నా వొక్క్యధార ఎక్కువ వెయ్యకపోతే యీామను కొంటాడు? ఛీఛీ! నా జన్మ చవిటిలో బెడితే ఏ విషాముష్టి వేళ ఈ కొంపలో దిబ్బేసుకొన్నామో ఈనాటివరకూ. వొకప్పుడు గాకపోయినా వొకప్పుడైనా నామనస్సుకు కాస్త 'విశ్రాంబరం' లేకపోయె. నా బతుకు బూడిదగాను. ఆ నారాయణమూర్తి నా బోటిదాన్నన్నా దబ్బున తీసికెళ్ళడు, ఆ కామయ్యను తీసి కెళ్లినట్లు .." అంటుంది ఆ మొగారు, వంటింటిగడపలో పైట చెరగుమీాద పడుకొని ఏడుస్తూ.

ఇక నాగరాజు ఏముఖంబెట్టుకొనివాళ్లింట్లోవుంటాడు? ఏ ముఖంబెట్టుకొని వాళ్లింటికెడతాడు?. వెంకాయమ్మపోయి నాలుగు మాసాలు గావొచ్చు. అయితేమాత్రం?

ఇంతకాలం అది పుట్టింట్లో ఎందుకున్నదో నాగరాజుకు చప్పున అర్థంగాలేదు. ఒక్కతే పిల్లమ్మ తల్లీదండ్రీ ప్రేమ చాత విడిచిపెట్టలేకుండా వున్నారనుకోడానికిఅదీగాదు.అయితే ఇంటిపనేమన్నా అందుకొంటుందేమోనని సరిపెట్టుకోడాని క్కూడా వీల్లేదు. వెంకాయమ్మకా పని చాతకాదు. అది కాఫీ గాస్తే మురుసీళ్లకంటే హీనంగా వుంటయ్. చెంచాడు కాఫీ గుండవేసి పదిమందికి కాఫీగాస్తుంది. రెండు వంకాయలు, నాలుగు దోస వరుగులూ వేసి పులుసుచేస్తుంది. పదిమందున్న కొంపలో ఇవి చద్దన్నాల్లోకిగూడారావు. అది వంటచేసిన రోజున యింటిల్లిపాదీ అర్థకాడు తినాలిసిందే! పట్టి పాచి ముండ. డబ్బుకీ ప్రాణానికీ లంకె వేసుకొంటుంది. ఇంట్లో ఎవరి

తోటీ అది మనసిచ్చి మాట్లాడదు. అందరితోనూ పోరుపెట్టు కుంటుంది. వెంకాయమ్మకు రెండో పురుగుండటం గిట్టిచావదు. ఇంతకాలం అదెట్లావుందో అక్కడ? కాపరానికొచ్చిన నెలా ఇరవైరోజులకే అన్నపెళ్ళికనిపోయింది. పికరులేదు ఇప్పటికీ—

అకాత్తుగా వెంకాయమ్మశీలంమీదికి నాగరాజు మనసుమళ్ళింది. అది ఎవణ్నాన్నా మరిగిందేమో? ఏమో భగవంతుడికి తెలియాలి నిజానిజాలు. ఈ కారణం నాగరాజుకు ఎందుకనో నచ్చింది. అది తనతోవున్న యేాబైరోజులూ, బలవంతాన వున్నట్టుగానే నాగరాజుకు అనిపించింది. అప్పుడు తనే కనుక్కోలేకపోయ్యాడు బుద్ధితక్కువ వెధవ. అమ్మ ముండా! ఎంతదగాచేసింది!!

నాగరాజుకు తన అనుమానం బలపడుతున్నట్లుగా తోచింది. వెంకాయమ్మను లోగడ ఎవడో పుల్లాయకి ఇస్తామన్నారు. ఆ పుల్లాయని ఈ పుల్లమ్మ 'లా' చేసిందట. అంతా అనుకొన్న తరవాత సంబంధం చిట్లిపోయింది. తరవాత నాగరాజు కిచ్చిచేశారు. ఆపుల్లాయది ఆ వూరే! ఇంకేం ఈముండ వాడితో......అందుకనే తనభార్య పుట్టింట్లో నాలుగు నెలలుండటానికి కారణమని నాగరాజు తీర్మానించుకొన్నాడు.

పాపం! ఈ అనుమానంతో నాగరాజు మనస్సు చివుక్కుమంది. లోకులందరూ తన్ను చూసి నవ్వుతున్నట్లుగానే వుంది. ఇదివరకు చాలామంది ఇతర్ల భార్యలను గురించి నాగరాజు లోగడ మాట్లాడాడు. అట్లాగే తన్నుగురించికూడా చాలామంది అనుకొంటారని నాగరాజు వూహించాడు. ఈవూహతో నాగరాజుకు పిచ్చెక్కినంతపని జరిగింది. కూడా

నీళ్ళుగూడా మానేశాడు. అసలు అతనికి అన్నం తినబుద్దెయ్య లేదు. నీళ్లుతాగబుద్దెయ్యలేదు. గుడ్డకట్టుకోబుద్దెయ్యలేదు. దిగనాసిల్లిపోయినాడు. చిక్కి శల్యమై పోయినాడు. పీనిగమల్లే తయారైనాడు, పిల్ల ఏనుగకుమల్లే వుండే నాగరాజు.

ఒకనాడు అకాత్తుగా వెంకాయమ్మ వొచ్చింది. మణుగు చలిమిడీ, బానెడు అరిసెలూ, మినపసున్ని వుండలూ తెచ్చింది వొస్తూవొస్తూ. నాగరాజు మాట్లాడలేదు. వెంకాయమ్మ రాకకు సంతోషానికి బదులు అసహ్యాం కలిగింది. మొఖం గోడచెంపకు తిప్పుకొన్నాడు నాగరాజు.

"విడప్పుడు ఎట్టావున్నా యిబ్బందిలో ఆనుకొన్నావమ్మా! బిడ్డడు? కూడేళ కూడు, నీళ్ళేళ నీళ్ళూ ఎరుగునా? పండునాయనల్లేవుండే నాగరాజు పూచికపుల్లయినాడు. అయితే ఇంతకాలం అక్కడేవుంటే ఇక్కడ ఎట్లాఅనుకొన్నావమ్మా? నాలుగు నెలలయిందిగదా పోయి, కాకపోతే వొస్తూపోతూ వుండకపొయ్యావా వెంకూ?" అన్నది పక్కింటి మంగమ్మ.

"అప్పుడు మా వారు నూటడెబ్బయ్ పౌన్ల బరువువుండేవారు. చచ్చిపోయేదాన్ని మంగమ్మ పిన్నీ ఇక్కడవుంటే. బతకనివ్వడనీ, ఎప్పుడో కాలో చెయ్యో విరిచేస్తాడనీ భయపడ్డాను. తల్లిలాంటిదానివని నీతో అంటున్నాను పిన్నీ! అంత లావాంటి 'హరి' తో వేగలేకనే వెళ్ళిపొయ్యాను. ఇప్పుడు సన్నబడ్డారు. నూటపాతిక పౌన్లబరువే వున్నారట. నామీద అనుమానంతో చిక్కిపొయ్యారనిగూడా నాకు తెలుసు. అందుకే మళ్ళీవచ్చాను." అన్నది— వెంకాయమ్మ సిగ్గు లేకుండా.

# కన్న కడుపు

అల్లుడు ఇలా చెడిపోతాడని శేషగిరమ్మగారనుకోలేదు. చదువుకొన్నవాడు. చక్కనివాడు. ఇంత మాత్రమే అయితే తను శివరామయ్యకు కూతుర్నిచ్చేదికాదు. శివరామయ్యకంటేమంచివాళ్ళు ఎంతమంది యిదివరకు సంబంధాలకు రాలేదు? వరమ్మ వాళ్ళెవళ్ళనీ వొప్పలేదు. కూతురు నెత్తిమీద బలవంతాన ఒక తద్దినం తెచ్చిపెట్టటం శేషగిరమ్మ ఏనాడూ చెయ్యలేదు ఒక్కగా నొక్క కూతురు. లేక లేక పుట్టింది. కట్టుకుపోయినంత ఆస్తి. ఇంత కలవాణ్ని చూసి యివ్వాలిసినఅవసరం ఏమాత్రంలేదు.అందుకే శివరామయ్యకు చెప్పుకో దగ్గంత ఆస్తి లేకపోయినా వరమ్మనిచ్చి పెళ్ళి జేసింది.

వరమ్మకు పెళ్ళి కాబొయ్యే వరకూ భర్త సంగతి తెలీదు. ఒకవేళ తెలిసినా అతని రూపానికి భ్రమించి, అతని స్వభావాలను సహించి భరించేదేమో మరి? భర్త తనను మోసగించాడని ఆమె 'ఫీ'లయింది. తననూ, తన కూతుర్నీ మోసగించాడని శేషగిరమ్మ అనుకొంది. పనిగట్టుకొని శివరామయ్య వాళ్ళను మోసగించిందేమీలేదు. మొదటినుంచీ అతని స్వభావమే అంత. అయితే శివరామయ్య మీది మోహపుకాంతిలో వరమ్మకు అతని గత జీవితంతో అవసరం లేకపోయింది. కూతురు దప్ప మరొక ప్రపంచమే వున్నట్లు వొప్పుకోని శేషగిరమ్మకు; కూతురుకు కనిపించని తప్పులు కనిపించటానికి వీల్లేదు మరి.

శివరామయ్య పెళ్ళయిన కొంతకాలానికి భార్యనుతనింటికి తెచ్చుకొన్నాడు. అల్లుడూ కూతురూ 'సుఖంగా' వుంటున్నారని విని శేషగిరమ్మ సంతోషించింది. నిజానికి ఆమె సంతోషించవలసింది యింత కంటే ఏముంటుంది గనక.

వరమ్మ రాసిన వుత్తరం చదివాక శేషగిరమ్మ కల విచ్చిపోయింది. తనింతకాలం అనుకొంటున్నది యదార్థాన్ని కాక, దానితాలూకు ఛాయలను మాత్రమేనని ఆమెకి వుత్తరం తెలియచేసింది. కూతురు, అల్లుడు ఎంత సుఖంగా కాపరంచేస్తున్నదీ నిదర్శనానికి, యీ వుత్తరం చాలు.

పాపం! శేషగిరమ్మగారి నడుం విరిగినంతపనయింది. చిన్నప్పటినించీ జలుబుగూడా చెయ్యకుండా (!) ముత్యమల్లే పెరిగింది. ఒక్కనాడైనా యింత శొంఠిగంధంరాయించుకొన్న పాపాన పోలేదు. బిడ్డ ఈ సుఖరోగాలతో ఎంత బాధపడుతోందో? శేషగిరమ్మ కళ్ళ వెంబడి నీళ్ళొచ్చినై. శివరామయ్యను చెడబడా తిట్టింది. తిట్టినందువల్ల ప్రయోజనం ఏమీ వుండదు. తిట్టాననే తృప్తి తప్పితే! శివరామయ్యను యింకెన్ని తిట్టినా వరమ్మకు పట్టుకొన్న జబ్బులేమీ పోవు. నయంచేస్తే పోతై. మూడు పచ్చ కాగితాలు రొంటెన దోపుకొని కూతురు దగ్గిరికి బయలుదేరింది శేషగిరమ్మ.

ఆమె వొచ్చేటప్పటికి శివరామయ్య యింట్లో లేడు. ఎవరో ముసలమ్మ శేషగిరమ్మను పలకరించింది. ఆమెకు యివన్నీ పట్టలేదు. కూతురు ఎట్లావుంది? ఏ స్థితిలో??

తల్లి గదిలో కొచ్చేటప్పటికి వరమ్మ వొంటినిండా శాలువాకప్పుకొని కళ్ళుమూసుకొని మూలుగుతూ వుంది.

కళ్ళల్లో నుండి నీళ్ళు బుగ్గలుమీదుగా జారిపోతున్నయ్. పచ్చగా వుండే దాని ముఖంనల్లకప్పేసింది. మొఖంనిండా మచ్చలు, కురుపులు.

"వరూ"

వరమ్మ తల్లిని చూసి బావురుమన్నది. శేషగిరమ్మ కూతుర్ని లేవదీసి కూచోబెట్టింది. వరమ్మ వొంటిమీద గుడ్డ లేదు. చీముకారుతున్న పుళ్ళు, మచ్చలు, వాటికి పూసిన పసరు, కూతుర్ని ఆ స్థితిలో చూసిన తరవాత శేషగిరమ్మ ప్రాణం దిమ్మరపోయింది.

వరమ్మ తల్లిని కావిలించుకొని ఏడ్చింది. శేషగిరమ్మ ప్రాణం అన్నుబట్టింది. గుండె దిగజారింది.

"ఛీ వూరుకో అమ్మా! నాలుగు రోజుల్లో నయమయి పోతాయి, నేను నయం చేస్తాగా. ఇదుగో మూడొందలు తెచ్చాను. కావాలంటే యింకా తెప్పిస్తాను. నీకంటే నాకిం కెవరున్నారే తల్లీ" అన్నది శేషగిరమ్మ.

"బాగుచేయిస్తావు. ఏంలాభం బాగుచేయించి? కాస్త ఆరోగ్యం పుంజుకునేటప్పటికి మళ్ళీజబ్బులు...లాభంలేదు. నేను బతకను"—

శేషగిరమ్మ కూతురుకు ధైర్యంచెప్పి అనునయించి, లాలించి అడిగింది సంగతేమిటని.

"పొరబాటుపడ్డాను. సున్నితంగా, వుంటాడని భ్రమి స్తాను. కానీ...వొట్టి పశువు. సిగ్గువిడిచి చెబుతున్నాను ఒకోక్కరోజు కాళ్ళకు చుట్టుకొని ఏడ్చేదాన్ని— కొడతాడు

తంతాడు. ఆఖరికి నా ఏడుపు చూడలేక మేనకను వుంచుకొన్నాడు".

"మేనక ఎవరు?"

"బోగంది."

శేషగిరమ్మ నిట్టూర్పు విడిచింది. అంతకంటే అప్పుడు ఆమె చేయగలిగిందేమీ లేదు.

"అన్నీ నేను నయం చేస్తాను తల్లీ! వారం రోజుల్లో అన్నీ పోతయ్!"

"ఏం లాభం? ఆ సంతోషం ఎంత కాల ముంటుంది? నెల తిరక్కుండానే మళ్ళీ నాకు అంటిస్తాడు—నేను కోలుకొనే దాకా ఆయన్ని దానింటికి పోనివ్వబోకమ్మా—ఈ లోపుగా ఆయనగారిక్కూడా మందులిప్పించు. నేను సరిగ్గా వుండాలంటే ఆయనా వుండాలిగా—"

శేషగిరమ్మ యింతవరకూ అల్లుడితో సరిగ్గా మాట్లాడి ఎరుగదు. ఈ రోజున యీ సంగతి అతనితో ఏమని చెబుతుంది? ఎట్లా చెబుతుంది? తనకూతురుకోసం సిగ్గు, భిడియము, అభిమానమూ చంపుకోవాలి. లేకపోతే కూతుర్నే చేజేతులా చంపుకొన్నట్లవుతుంది. వరమ్మ పసికాయ! శివరామయ్య బలంగా, గట్టిగా, వుక్కుమనిషికిమల్లే వుంటాడు. వరమ్మకు ఎటుగూచి తను నయంచేస్తుంది. అయితే దాని ఫలితం శివరామయ్యగూడా నయంచేసుకొన్నప్పుడే! అంత కంటే ముందు ఆ అబ్బాయి, ఆ బోగం ముండయింటికి పోకుండా చూడాలి. ఎంత చికిత్స చేసుకొంటున్నా, రోజురోజూ, రోగాల్ని తెచ్చుకొంటుంటే ఎప్పటికి నయమయేటట్టు? కాక

పోతే... శివరామయ్యా చచ్చినా ఫర్వాలేదు. వరూ బాగుంటే సరి.

గడియారం రెండు గంటలు కొట్టేందాకా ఆమె ఆ రాత్రి ఆలోచిస్తూనే వుంది. వూరికే ఆలోచించి ఏంలాభం? ఏదో విధంగా సరి చేసుకోవాలి పరిస్థితులు. తలుపు వేసి పడుకొందామని లేచింది. మేనకయింటినుండి ఎప్పుడు వొచ్చాడో తెలీదు; శివరామయ్యా మంచంమీద పడుకొని వున్నాడు. ఈ వెధవ మూలంగా తన కూతురుకు ఎంత గతి పట్టింది! ఎర్ర కలువలాగ వుండే వరమ్మ నల్లబడి, చిక్కి, అసహ్యంగా తయారైంది. అందంగా, నున్నగా మెరుస్తోవుండే దాని వొంటికి, సుఖ రోగాల మచ్చలు, పుళ్లు, చీము, రసి; దానికి కట్లు. ఈ రోగంతో ఎంత బాధపడకపోతే "అమ్మా! నేను బతకను-ఆయన నన్ను బతకనియ్యడు" అంటుంది వరమ్మ!

శేషగిరమ్మ అట్లా అనుకొంటూ, దీపం తగ్గించింది; మినుకు మినుకుమనేట్టు, చీకటి దీపాన్ని మింగేట్టు. ఆమె వొణుకు, వుద్వేగం, వొంటిలో ఆవేశం; చీకటికి చెదురుడు. అట్లా చీకటిని తొలగదీసుకొంటూ వెచ్చగా నడిచింది...

శేషగిరమ్మ వుదయం ఎండకు, బద్ధకంగా, మత్తుగా, లేచింది; అందంగా కలలుగంటున్న కళ్ళమీదకు గాలిన వెంట్రుకలను, సున్నితంగా పైకి తోసుకొంటూ, నవ్వుతో శివరామయ్యాగూడా బలువుగా లేచాడు. ఆ యిద్దరూ నవ్వుకొన్నారు ఆ రోజున వొంటరిగా కలుసుకొన్నప్పుడల్లా! అంతే!! వరమ్మ కోలుకోడానికి పట్టిన నెల రోజుల్లోనూ, శివరామయ్యా, ఎప్పుడూ మళ్లీ మేనక యింటికి వెళ్ళవలసినపని కలగలేదు.

# సంతానం

మా ఆవిడకు పిల్లలంటే ఎంతో యిష్టం. నాకు మహా చిరాకు. ఆమె కాపరాని కొచ్చిన ఈ రెండు సంవత్సరాల కాలంలోనూ తన వాంఛను చాలా సార్లు నాకు వ్యక్తా వ్యక్తంగా తెలియ జేసింది. తన కోర్కె ఎంత బలీయమైందో, అది నా ముందు రుజువుచేసుకోడానికిగాను పక్కింటి పిల్లలను అస్తమానూ తనదగ్గ రేవుంచుకొంటుండేది. వాళ్ళుదాన్ని నానా ఖంగాళీ చేస్తుంటారు. వొంటిమీద వొకటికి, రెంటికీ [illegible] పోతుండేవారు. అది ఏ మాత్రం అసహ్యించుకోదు సరిగదా "పసిపిల్లలాయె, ఏం తెలుస్తుంది మరి?" అంటుంది పైగా.

పొరుగింటి పిల్లలమీద తనకుండేంత వాత్సల్యం నాకూ వుండాలని మా ఆవిడ వాదిస్తుంది. "మనకు ఎటుగూడి. లేనే లేరు. ఎదటివారికి వున్నందుకన్నా సంతోషించరాదూ" అంటుంది.

"మనకు లేరనే సంగతి బాగా నేవుంది. ఎదటివారికున్నదని నే నెప్పుడూ సంతోషించకుండా పోలేదు. అల్లాంటి తక్కువరకపు బుద్ధులకు నేను చాలా దూరంగా వుంటాను" అన్నాను.

"అంతవరకే; కనిపిస్తూనే వుందిగా మీ మాటలపస. మీకు నిజంగా "అదే లేకపోతే; మొన్న రాధాయ్ గాడు మీ టేబుల్ దగ్గరకొస్తే ఎందుకు గసిరారండీ?"

అప్పుడేదో రాసుకుంటున్నాను. ఆ వేళన వొచ్చాడు. వొచ్చినవాడు నా దగ్గరికొచ్చి "నాన్నా చీఁయ్ఁ" అంటాడు, తన చీమిడి ముక్కును నాకు చూపిస్తూ. అందుకని గసిరాను. అది మా ఆవిడకు కటువైంది. వ్రాళ్లోవాళ్ళు పనీపాటా లేకుండా ఉత్పత్తిచేస్తున్న పిల్లలందరికీ చీమిడి తుడవడమే నా డ్యూటీలాగా మాట్లాడుతుంది మా ఆవిడ. పిల్లలమీద తనకు ఆపేక్షవుంటే వుండొచ్చు. అదేలాగా ప్రతివాళ్ళకూ వుండాలని కోరడం సబబైన విషయంగాదు. తనకు ఆపేక్ష వుందిగాబట్టి పిల్లల మూతీముక్కూ తుడవమను, నాకేమాత్రం అభ్యంతరంలేదు. తనుచేస్తునట్లు ప్రతివాళ్లూ చేయాలని తన కొలబద్దల్తో అందర్నీ కొలవచూడడం సాహసం......

ఈ పిల్లలసమస్య భార్యాభర్తలమైన మా ఇద్దరికేగా కుండా చాలామందికి అంటుకొంది. మా అత్తా మామగ్గూడా ఇదేసమస్య పట్టుకుంది.

"మాలక్ష్మికడుపున వొక కాయకాస్తే చూసి చద్దామనివుంది" అంది మా అత్త. తను ఈ ప్రపంచంలో వుండడం కేవలం తనకూతురు సంతానాన్ని చూడడం కోసమేననే భావాన్ని ధ్వనింపచేస్తూ.

బంధువులకు స్నేహితులకూ, చివరకి ముఖపరిచయస్తులికికూడా ఇదే ధోరణి.

"పిలలు ఏమనా..." అంటారాగు

"ఇంటికి పిల్లలే కళండీ. లేకపోతే ఏముందీ ? ఎడారి; ఇసుకఎడారి" అంటారు, పదేసిమంది సంతానాన్ని కన్న వారు నోరుచప్పరిస్తూ.

మొత్తంమీద ప్రతివాళ్ళకూ నా సంతానానికి సంబంధించిన దిగులు కొంతవుంది. నాకు యిష్టం వున్నా లేకున్నా వీళ్ళందరి సంతోషం కోసమైనా నేను పిల్లల్ని కనిపెంచవలసిన బాధ్యత ఎక్కువగా కనిపిస్తుంది.

నేను ఈ విధంగా మల్లగుల్లాలు పడుతూనే వున్నాను. మా ఆవిడ తనప్రయత్నాన్ని సాగిస్తూనేవుంది. ఎరికెలవాళ్ళకు పాతకోకలిచ్చి సోది అడుగుతోంది. కనపడ్డ ప్రతి బైరాగి వెధవచేతా తాయత్తులు, రక్షరేఖలు కట్టించుకొంటుంది. ఆచార్ల వారిదగ్గర తులసితీర్థమూ, అంజనేయస్వామిగుడికి ప్రదక్షిణాలూ సాగించింది. సత్యన్నారాయణ వ్రతాలూ, ఏకాదశి వుపవాసాలూ ప్రారంభించింది. దీనిభక్తి, దీక్షా చూస్తే పుటిక్కన ఏదేవుడేనా కరుణించి దీనికి పిల్లలను పుట్టిస్తాడేమోనని నాకు మహాభయంగా వుంది. దానిదంతా వొట్టి డాంబికమనీ, స్వార్థంకోసం మిమ్మల్ని ప్రార్థిస్తుందిగానీ మీమీద భక్తిచేత గాదనీ, స్వలాభకాంక్షుల ఈప్సితాలు తీర్చడం చాలా నీచమనీ నేను దేవతాగణాన్ని వేడుకోవలసివొచ్చింది.

దేవతలూగూడా ఆడవాళ్ళ పార్టీయే! నా ప్రార్థనలూ, వేడికోలులూ దుమ్ములో కలిసిపొయ్యాయి. మా ఆవిడ కోరికే నెగ్గింది. దేవతలు ప్రత్యక్షమై మాఆవిడకు "సంతు"ను ప్రసాదించకపోయినా దేవతల్లో లెఖ్ఖగట్టవలసిన మహాయోగి వొకడు మా గ్రామపరిసరాల్లో ప్రత్యక్షమయ్యాడు.

ఆయన నూటయాభైసంవత్సరాలు హిమాలయపర్వతాల్లో చండప్రచండంగా తపస్సుచేసి ప్రస్తుతం భూలోక సంచారం కావిస్తున్నాడట.

చూసినవాళ్ళంతా ఆయన్ను "మహాపురుషుడ"ని పొగడటం స్వయంగా విన్నాను.

ఎవరికి ఏపనికావలసినా ఆయన "నావల్లకాదు"అనడు. సంతానంలేనివాళ్లు ఎంతోమంది ఆయనవల్లసంతునుపొందారు. రోగాలు, కరువులు, తుపానులు, యుద్ధాలు—సర్వం ఆయన తన గోటితో తీసివేస్తాడు. మహారుషి" అన్నారు చాలమంది.

మా ఆవిడగూడ స్వామీజీ దగ్గరకు పోతానంది. కనిపించని దేవతలను ప్రార్థించడం, వారువరమీయడం వేరు సంగతి. ప్రత్యక్షంగా కళ్ళముందు కనిపిస్తున్నాయన, అందులో నూట యాభై సంవత్సరాలు ఘోరాతి ఘోరంగా తపస్సు చేసిన మహారుషి "వరం" ఈయడమూ, అది ఖాళీగావడమూ కలలోని మాట. నా ప్రత్యుత్తరాన్ని లెఖ్కచేయకుండా స్వామీజీ దగ్గరకుపోయింది మాఆవిడ—

రాత్రికి మా పొరుగింటావిడ చెప్పింది.

"స్వామివారు మీ ఆవిడ ప్రార్థనను ఆలకించారు. పూర్వజన్మలో మీ ఆవిడ శిశుఘాతకురాలట. ఆ పాపం పరిహారం చేయడంకోసం ఏడు రాత్రుళ్ళు ఏకాంతోపదేశం చేయాలట. అప్పటిగ్గాని బిడ్డలుపుట్టరు"

నేను మా ఆవిడముఖం చూశాను. నిజమే నన్నట్టు తలతిప్పింది.

"అయితే ఏడు రాత్రుళ్ళూ పోతావన్నమాటేగా?" అన్నాను.

"ఇంకా అన్నమాటేగా ఏమిటండీ? అసలు ఆ మహానుభావుడు మనను పలకరించిందే మహాఘనం. అల్లాంటపుడు వారే స్వయంగా ఉపదేశం చేస్తానంటే పోకుండాఎట్లా? నేనొక్కదాన్నేనా ఏమిటి? మన వీధిలోనివాళ్ళు చాలామంది వున్నారు"

"వాళ్ళంతా పిల్లలకోసమేనా"?

"మీకు గాబట్టి పిల్లలంటే అసహ్యం. అందరూ అట్లాగే వుంటారా ఏమిటి"?

నేనేం మాట్లాడలేదు.

ఏడు రాత్రుళ్ళూ ఏకాంతోపదేశం పొందింది. మా ఆవిడ.

ఎనిమిదో రోజున స్వామివారిని వారిశిష్యగణాన్ని మా యింటికి భిక్షకుపిలిచి నాచేత వందరూపాయలు ఖర్చు చేయించింది.

పోతూపోతూ స్వామివారు దీవించారు. "తొందరలో సుపుత్రుణ్ని ఎత్తుకొందువుగాక!" అని.

గ్రామంలోని భిక్షలన్నీ పూర్తిచేసుకొని స్వామివారు పీఠం ఎత్తేశారు. స్వామివారు వెళ్ళిపోయిన తొమ్మిది నెలలకు వారివద్ద ఏకాంతోపదేశం పొందిన ఆడవాళ్ళంతా ప్రసవించారు. స్వామివారు సమదృష్టి కలిగినవారు. వారికి ఉచ్ఛనీచాలు లేవు. అందరికీ వొకే రూపురేఖలు కలిగిన సంతానం

దిగింది. కళ్ళు, ముక్కు, నోరు, తల, శరీరం, రంగు, అంతా వొకతీరకం. స్వామివారికీ వారు ప్రసాదించిన సంతానానికీ భేదం చీమతలకాయంతైనా లేదు. అచ్చుగుద్దినట్లుగా స్వామి వారి పోలిక.

నాకు పిల్లలంటే మహాచిరాకే అయినా స్వామీజీ ప్రసాదించాడు గాబట్టి వాణ్ని ఎంతో లాలనగా చూస్తుంటాను.



# పట్టెపట్టు

తన పొలంవేపు చూడగానే, ముందు ఆశ్చర్యమూ, ఆ వెనుక అనుమానమూ కలిగాయి బసవయ్యకు. తను పొర బడ్డాడేమోనని ఒకటికి రెండుసార్లు పరకాయించి చూశాడు బసవయ్య. కానీ కాదు. తను మరొకరిపొలం చూసి, తనదే నని భ్రమపడలేదు. దాదాపు పాతిక సంవత్సరాలనుండీ తనకీ పొలంతో పరిచయముంది. ఇన్నిసంవత్సరాలనుండి పడనిపొర బాటు, ఇవాళ పడతాడా? కానీ, అనుమానించక తప్పలేదు.

అతనికి క్షణానికీ జ్ఞాపకముంది. నిన్న సాయంత్రం తను జీతగాడితో ఈ విషయం స్పష్టంగా చెప్పాడు. కావాలంటే, చెబుతున్నప్పుడు ఎవరెవరున్నదీ, ఏమి చేస్తున్నదీగూడా తను చెప్పగలడు. అయితే నాగన్న తను చెప్పిన పని చెయ్యలేదా? చెయ్యకపోతే, రాత్రి పొద్దుపోయిందాకా వాడెందు కింటికి రాలేదు? అప్పటికీ బసవయ్య జీతగాణ్ని అడిగాడు. పొలం వెళ్ళాననీ, కాలువకు కట్టవేసి, నీరు చేలోకి మళ్ళించి వస్తున్నా ననీ అన్నాడు నాగన్న. నాగన్న అబద్ధమాడతాడని నమ్మటం బసవయ్యకు అతీతమైనపని. నిన్నా మొన్నటివాడు కాదు. ఆరేళ్ళనుంచీ తనదగ్గిర పనిచేస్తున్నాడు. ఒక్కసారిగూడా తనచేత మాట అనిపించుకోలేదు. నిజానికి, తనకంటే, వ్యవ సాయంలో నాగన్నకే ఎక్కువ సంగతులు తెలుసు. ఏ పొలా నికి ఎప్పుడు ఎరువు వెయ్యాలో, దేని నెప్పుడు దున్నాలో, ఏ విత్తనాలు చల్లితే గింజ బాగా రాలుతుందో, ఏ ముఠా కూలీలు వళ్ళు దాచుకోకుండా పనిచేస్తారో తనకేం తెలుసు?

అన్ని పనులూ స్వయంగా వాడే చేసుకుంటాడు. ఒక్క క్షణం బద్ధకించడు. ఒక్క రవ్వ ఏమారడు. అందుకే నాగన్నంటే బసవయ్యకు ఎక్కడలేని నమ్మకమూ, విశ్వాసమూను.

అయితే మరి బసవయ్య ఎందుకు అనుమానించవలసి వచ్చింది? దానికి కారణం స్పష్టంగా కనిపిస్తూనే వుంది. తన చేనికి ఒక్క నీటిచుక్క రాలేదు. రాలేదు సరిగదా అంజయ్య చేనంతా తడిసింది. నిజం చెప్పాలంటే, తన చేనుకంటె అంజయ్య చేను ఏమాత్రమో మెరక. ముందు తన చేను నిండాలి, అప్పుడుగానీ అంజయ్యచేనుకు నీరు ఎక్కదు. అయినప్పుడు తనచేను నిండకుండా అంజయ్య చేనుకు నీరెలా ఎక్కింది? ఈ సమస్య బసవయ్యను చాలా వేధించింది. ఇట్లా జరగటానికి రెండే రెండు కారణాలున్నాయనుకున్నాడు బసవయ్య. ఒకటి: నాగన్న కాలువకు కట్టగట్టి నీరు చేలోకి పెట్టకనైనాపోవాలి. లేదా, తనచేనిగట్టు బిగదొక్కి, అంజయ్య తన చేలోకి నీరు పెట్టుకునైనా ఉండాలి. ఇంతకుమినహా మరొకటి జరగడానికే వీల్లేదు. అదృష్టవశాత్తు బసవయ్య నాగన్న వ్యక్తిత్వాన్ని అనుమానించలేదు. అనుమానించలేను కూడాను. ఇంతకాలంనుంచి ప్రాలుమాలిన నాగన్న, ఈ స్వల్పవిషయంలో తనతో అబద్ధమాడి వుంటాడనుకోవడం హాస్యాస్పదం. పోతే ఆకారణమే నిజమయి ఉండాలి. ఇటీవల అంజయ్య తననుగురించి అంటున్న మాటల్నిబట్టి చూస్తే ఈ పని అతగాడే చేసి ఉంటాడని నమ్మక తప్పటంలేదు.

ఏది ఏమయినా ఈ క్షణాన తనుచేయగలిగిందేమీ లేదు. ఇప్పటికప్పుడే రెండుబారల ప్రొద్దెక్కింది. ఇంటికి వెళ్ళి

సావధానంగా ఆలోచించాలి, ఆలోచించి, కీలెరిగి వాత పెట్టాలి. లేకపోతే ఇది తన అసమర్థతగా, ఆ అంజయ్య అర్థం చేసుకోవచ్చు. తనెందుకూరుకొంటున్నాడో ఈనాటికీ అతగాడి కర్థంకాలేదు. వాడికర్థానికి తనేం చేస్తాడు? బసవయ్యా గిరుక్కున ఇంటిముఖంపట్టాడు. ఇంటికొచ్చేటప్పటికి ఎడ్లకు మేత వేస్తున్నాడు నాగన్న. బసవయ్యా నాగన్నను పలకరించ లేదు. నాగన్న ఓరకంటితో తన యజమానిని చూశాడు. ఏదో జరిగిఉంటుందని అప్పుడే అనుమానించాడు.

బసవయ్యాకు ఆ పూట సరిగ్గా అన్నం సహించలేదు. అటూ ఇటూ కెలికి లేచాడు. భర్తవైఖరిచూచి భార్య కూడా అతన్నేమీ పలకరించలేదు. ఇట్లాంటి సందర్భాల్లో తనంతట తాను పలికిందాకా బసవయ్యాను పలకరించటం మంచిదిగాదు. ఒకసారి తెలియక పలకరించి, చావుదెబ్బలు తిన్న దావిడ.

బసవయ్యా సరాసరి గదిలోకెళ్ళిపోయాడు. చిన్న కూతురు, పొగాకు కాడా, పెంకుతో నిప్పూ, అక్కడ బెట్టింది. రోజూవారాదిరిగా బసవయ్యా చిన్నకూతురును పొట్టమీదకూచో బెట్టుకుని కబుర్లు చెప్పలేదు. ఇప్పుడో మరికొంచెంసేపటికో, తండ్రి తనను దగ్గరకు తీసుకొంటాడని, ఆపిల్ల ఒకటిరెండు నిమిషాలు అలాగే నిలబడ్డది. బసవయ్యా కూతురువేపు చూడలేదు సరిగదా, పొగాకన్నా చుట్ట చుట్టుకోలేదు. ఆ పిల్ల బిక్కమొహంతో వెళ్ళిపోయినసంగతి బసవయ్యా గమనించనేలేదు. గమనించగల స్థితిలోకూడా లేడు. అతని ఆలోచనలన్నీ అంజయ్యా చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

అంజయ్య తనమీది కిలా కాలుదువ్వుతున్న దెందుకో బసవయ్యకు తెలియడంలేదు. తనకూ, అతనికీ అసలు సంబంధ మేమిటి? ఎంత తిరగవేసినా ఏ కోసనీ వాళ్ళు బంధువులు కారు. నిష్కారణంగా తనమీద కక్షగట్టాడు. నిష్కారణం గానే రెండేళ్ళక్రిందట తనమీద కేసు బెట్టాడు.

అసలు ఆ దేవాలయం కట్టించింది బసవయ్య తాత. అందులో మరొకరిసొమ్ము చిల్లిగవ్వకూడా కలపలేదు. ఆ దేవాలయం పూర్తయ్యేసరికి నాలుగెకరాల పొలమమ్మా డాయన. మరొక ఆరెకరాల సుక్షేత్రమైన పడమటి పొలం మాన్యంక్రింద రాసిచ్చాడు. ఊళ్ళో రామాలయం లేదనే కొరత అప్పటిగ్గానీ తీరలేదు. ఆనాటినుంచీ ఆ గుడిమీద సర్వాధికారాలు ఆ వంశంవారే చెలాయిస్తున్నారు. ప్రతి సంవత్సరం నవమి ఉత్సవాలకయ్యే ఖర్చంతా వాళ్ళే భరా యిస్తున్నారు. పీటలమీద కూచుని సీతారాముల కల్యా ణం వైభవంగా జరిపిస్తూ వస్తున్నారు. రెండేళ్ళక్రిందట అంజయ్య పేచీకి దిగాడు. బసవయ్య పెట్టేఖర్చు తనూ పెడతా నన్నాడు. ఆ మాటకొస్తే అతనికంటే ఎక్కువఖర్చే భరా యిస్తానన్నాడు. తను, తనభార్యా పీటలమీద కూచోనితీరా లన్నాడు. గుడి కట్టించింది ఎవరైనా పూజ చేసుకునే హక్కు ప్రతివాడికీ ఉంటుందన్నాడు. బసవయ్య అందుకు ఎంత మాత్రమూ ఒప్పుకోలేదు. అంతకంటె తనకిక అవమానమేమీ లేదనుకున్నాడు. ఆరునూరైనా, నూరారైనా అంజయ్య పీటలమీద కూచోటానికి వల్లకాదని మోడీ వేశాడు. అంతమాత్రాన అంజయ్య వెనకడుగు వెయ్యలేదు. తను

కూచోవడానికి వీలే లేకపోతే ఇంకొకరుకూచోవడానికి అంత కన్నా వీలుండదన్నాడు. గ్రామస్థులు దాదాపు రెండు కక్షలుగా చీలిపోయ్యారు. ఒకముఠా అంజయ్యను బలపరిస్తే మరొకముఠా బసవయ్యను బలపరిచింది. తీవ్రమైన వాదోపవాదాలు జరిగాయి. చివరికి పోలీసులు జోక్యం కలిగించుకొనవలసివచ్చింది. ఆ సంవత్సరం ఉత్సవాలు జరగనేలేదు. బసవయ్య గుడికి తాళం వేశాడు. అంజయ్య అదే గుడికి మరొక తాళం వేశాడు.

ఈ సంఘటన ఇంతటితో మాసిపోలేదు. ఆ ముఠావారు అంజయ్యకూ, ఈ ముఠావారు బసవయ్యకూ చెవులు కొరికారు. ఏవో చిన్న చిన్న కారణాలను పురస్కరించుకొని, ఒకరిమీద మరొకరు కేసులు నడుపుకొన్నారు. కోర్టులచుట్టూ తిరిగారు. కోరెనంత డబ్బు ధ్వంసంచేశారు. ఇదిట్లా జరుగుతుండగానే అంజయ్యముఠా తమలోతాము చందాలు వేసుకొని, ఉత్తరపు వీధిన మరొక రామాలయం కట్టించింది. అంజయ్య పదెకరాల పొలం మాన్యం క్రింద రాసిచ్చాడు. "ఆరెకరాల మాన్యమిచ్చిన బసవయ్య" గుడిమీద అన్ని హక్కులూ చెలాయిస్తున్నాడు. పదెకరాల పొలం తనూ యిచ్చాడు. ఆ గుడిమీద అందరికీ హక్కు లున్నాయన్నాడు అంజయ్య. కావాలంటే, ఈ గుళ్ళోకొచ్చి, తనే పీటలమీద కూచుని, కళ్యాణం జరిపించుకొన్నా బసవయ్యను కాదనను పొమ్మన్నాడు అంజయ్య. ఆ గంతి చేతులుచచ్చి కూచోలేదని కబురు చేశాడు బసవయ్య.

ఒకసారి అంజయ్యకు ఊడ్పుకూలీలు దొరక్కుండా చేశాడుబసవయ్య. మరునాటి ఉదయానికల్లా బసవయ్య నారు మడి కాస్తా పెద్దగొయ్యగా తయారయి కూనుంది. బసవయ్య పొరుగూరునుండి నారు తెచ్చుకొన్నాడు. అంజయ్య కూలి రేటు పెంచి, కూలిజనాన్ని రప్పించుకొన్నాడు.

ఈ కక్షలు ఇలా సాగిపోతూనే ఉన్నాయి అవకాశం చూచి ఒకరిమీద మరొకరు దెబ్బతీస్తూనే వస్తున్నారు. తనమీద అనవసరంగా కక్షకట్టాడని, తననుకవ్విస్తున్నాడనీ బసవయ్య అంటే; ఆ పనిచేస్తున్నది బసవయ్యే గాని, తన కలాంటి దుర్బుద్ధులు లేనేలేవని అంజయ్య అన్నాడు.

ఇద్దరిమధ్యాగల ఈ వైషమ్యాన్ని పురస్కరించుకొని, లాభించేవాళ్ళు లాభిస్తూనేఉన్నారు. వారంరోజుల క్రిందట అంజయ్య గట్టుమీద గడ్డి మాయమైపోయింది, ఈ పని బసవయ్య చేయించిందేనని అంజయ్యముఠా వారన్నారు. రాత్రి బసవయ్య చేనుకు వెళ్ళవలసిన నీరు, అంజయ్య పొలానికి మళ్ళింది. ఈ పని అంజయ్య చేశాడని బసవయ్య నమ్మాడు.

అంజయ్య ఉత్తి జులాయిమనిషి. గిల్లికజ్జాపెట్టుకొనే గుణం వాడిది. భగవంతునిసాక్షిగా అంజయ్యగట్టుమీద గడ్డి ఏమయిందో తనకు తెలీదు. తనే కోయించినట్టు ఊరంతా టమటమా వేసినంతపని చేశాడు. తనుగానీ, తనముఠావాళ్ళు గానీ, ఆ గడ్డికోస్తున్నప్పుడు ఎవరైనా చూశారా? లేనప్పుడు తనేకోసినట్లు రుజువేమిటి? అంజయ్యే ఆ గడ్డికాస్తాకోయించి, తనమీదకు నెట్టాడు అతనికి కావలసిందల్లా తగాదా. తగాదా

కోసం అతనంత ఉబలాటపడుతుంటే, వద్దనటం తనకు మాత్రం భావ్యమా? దెబ్బకు దెబ్బతియ్యడానికి ఈ బసవయ్య సందే హించడని, అంజయ్యకింకా తెలియదేమో? తెలియనిపక్షాన, దాన్ని తెలియచేయవలసిన అవసరం ఎంతయినా ఉంది.

ఎట్లా తెలియచెయ్యాలో బసవయ్య ఆలోచించాడు. నాగన్నను చాటుకు పిలిచి విషయమంతా చెప్పాడు. నాగన్న మొఖంలో మొదట భయపుఛాయలు అగుపడ్డాయి. బస వయ్య ఏమిటేమిటో నొక్కి నొక్కి చెప్పాడు. నాగన్న తలెగరవేశాడు.

చాలా ప్రొద్దుబోయింది. చంద్రుడు ఎర్రగా పొలాల మీదనుండి మేలుకొంటున్నాడు. చలిగాలి పదును తేలు తోంది. నాగన్న మెల్లగా, అడుగులో అడుగువేసుకొంటూ, గట్టువారనే నడుస్తున్నాడు. కీచురాళ్ళరొద, కప్పల బెక బెకలు; కాలవలో ఏదోకదలిన చప్పుడైంది. చేతిలోవున్న బడితను భుజంమీదకెత్తి, నేలవారగా కూచున్నాడునాగన్న. మళ్ళీ అదేవిధమైన చప్పుడు. నీళ్ళు జుయ్‌న పారుతున్న ధ్వని. కాలువలో అలలులేచి, ఒడ్డుకు కొట్టుకుంటున్నాయి. నాగన్న రక్తం ఉడుకెత్తింది. నరాలు ఉబికాయి. కణతలు కొట్టుకున్నాయి. ఒక్క పరుగులో చప్పుడయిన చోటుకు చేరుకున్నాడు. కాలవకడ్డంగా గజమెత్తు అడ్డకట్ట కనిపించింది. నీరు ఉరకలుబెడుతూ అంజయ్య పొలంలోకి దూకతోంది. అడ్డకట్ట, నీటితాకిడికి పడిపోకుండా, గడ్డి, గాదమూ బిగ దొక్కుతూఉన్నవ్యక్తి నాగన్నను చూడనేలేదు. చూచి నట్లయితే, గొడ్డలి గట్టుమీద కాక, చేతిలోనే ఉంచుకొనే

వాడు. నాగన్న ఆ వ్యక్తిని గుర్తుపట్టాడు. పోలిగాడిమీద నాగన్నకు ఎక్కడలేని కోపంవచ్చింది. బసవయ్యజీతగాడు "పోలిగా" అంటూ కర్ర పైకెత్తాడు. అంజయ్యజీతగాడు "నాగన్నా" అంటూ గొడ్డలి పుచ్చుకొన్నాడు. ఫెటాఫెటా మని దెబ్బలు వినిపించాయి. నాగన్న భుజం రక్తం చిమ్మింది. పోలిగాడు తుభుక్కున నోట్లోంచి నెత్తురు ఉమ్మేశాడు. ఎవరి కోసం నాగన్న దండధరుడయ్యాడో, ఎవరి కోసం పోలిగాడు గొడ్డలి పట్టుకున్నాడో ఆ బసవయ్య, అంజయ్యలు, వెచ్చనిగదుల్లో, మెత్తని పక్కలమీద, చక్కని శాలువలు కప్పుకొని, ఆదమరచి నిద్రపోతున్నారు. వీళ్ళిద్దరూ లేతవెన్నెల్లో, పొలంగట్టుమీద బురదలో, కీచురాళ్ళరొదలో కొట్లాడుకుంటున్నారు. ఎవరెవరికోసం దెబ్బలు కొడుతు న్నారు? ఎవరెవరి కోసం దెబ్బలు తింటున్నారు?



# ప్రవృత్తులు

నా చుట్టూ పసుపుపచ్చని కాంతి. ఆ కాంతి దూరం పోతున్నకొద్దీ లేత ఎరుపుగా.. తరువాత ముదురు ఎరుపుగా... ఆ తరువాత నలుపు ఎక్కువగా కలిసిన మరొక వర్ణంగానూ మారుతూ చివరకు చీకటి—కటిక చీకటయింది.

కాళ్లూ చేతులూ కదిలించాను. కిటకిటమనే రొదలూ, జలజలా మట్టిరాలిన చప్పుడూ వినిపించింది. నేనెక్కడున్నాను? ఈ కాంతి ఏమిటి? ఈ రొద లేమిటి? మెదడును కదిలించాను. కదిలించి ఆలోచించసాగాను. చాలా దూరంగా లోతుగా ఎవరో నాచుట్టూ కూచుని ఏడుస్తున్నట్లుగా కొంచెం జ్ఞాపకముంది.

నా భార్య పెద్ద కుంకంబొట్టు పెట్టుకొని, కాళ్ళకు, మొడకు పసుపు రాసుకొని నా గుండెలమీద తల పెట్టి ఘోరంగా ఏడుస్తున్నది. నా యింటిచుట్టుపక్కల వాళ్ళు నా చుట్టూ మూగివున్నారు. వాళ్ళడిగే ప్రశ్నలు, ఏడుపులోవారు వెలిబుచ్చే నా ప్రజ్ఞా విశేషాలు స్పష్టంగా వినిపిస్తున్నాయి. సమాధాన మివ్వాలనీ, యిద్దామనీ మనసులోవుంది. అయితే నాసమాధానాలు, వాక్యాలరూపంలో రావటానికి అక్షరాలు కుదరటల్లేదు. అతి ప్రయత్నపూర్వకంగా నేను సమకూర్చిన సమాధానం విని నాచుట్టూవున్నవాళ్ళు మరింత బిగ్గరగా ఏడవటమూ, ఆందోళనపడటమూ. నేను సమాధానం యివ్వటంలో, వొక దానికి బదులు మరొకటి యిచ్చి వుటానేమో, నాకు తెలియకుండానే కొంచెంసేపటికి రకరకాల

కాంతిగోళాలు నా కళ్ళముందు ప్రళయరూపంతో నృత్యం చేసినయ్. నా నరాలు ఆ ఉద్వేగానికి తట్టుకోలేక గొల్లుమని ఘోషించాయి. నెత్తురుపగిలింది. ఆ మహాదీధితిని చూడలేక కళ్ళు నా ప్రయత్నం లేకుండానే మూసుకున్నాయి. క్రమ క్రమంగా కాంతి సన్నగిలుతూ, పలచబడుతూ చివరికి ఏరంగూ లేని తమాషా స్థితిలో పడ్డాను. ఏదో గొప్ప మత్తు నన్ను కమ్మేసింది...లేచిచూశాను. ఎంతకాలమైందో తెలియదు. కాలాన్ని తెలుసుకోవటానికి తగిన సాధన లేవీ నా చుట్టుప్రక్కల కనిపించలేదు. ఇప్పుడు నే నున్నది పగలో రాత్రో తెలుసుకుంటానికి ప్రయత్నించి విఫలుణ్నయ్యాను. పగలువుండే ఎండ, వేడిమి, రాత్రివుండే వెన్నెల, చీకటి ఉదయాస్తమయాలలో వుండే చిత్రవిచిత్ర రంగులూ నా చుట్టూవున్నాయి. ఇంక నే నేమని నిర్ణయించుకోవటం నాస్థితిని, కాలాన్ని?

"జాగ్రత్త! మెల్లిగా లేవండి!"

చుట్టూ చూశాను. అల్లంతదూరాన ఏదో పదార్థం కదులుతున్నట్లుగా కనిపించింది. కళ్ళు నులుముకొని పరిశీలనగా చూశాను. చర్మము, మాంసము, నరాలుపేగులు లేకుండా, ఎముకలుమాత్రమే మిగిలివున్న మానవుడు కనిపించాడు.

"మిమ్మల్నే! జాగ్రత్తగా! ఆఁ ఆఁ, గబాలున లేవకండి. స్మృతిచిహ్నంగా మీ నెత్తినపాతిన ఆ రాయి జారి మీ మీద పడవచ్చు...కొంచెం నెమ్మదిగా, ఆఁ...అదీ...అట్లా లేవండి" అన్నాడు ఆ మానవుడు.

అతను నామీద అపేక్షను, శ్రద్ధనూ, నాపట్ల జాగ్రత్తనూ చూపెడుతున్నాడు. చర్మం లేకపోతేనేం, అతను

'జీవితాన్ని అర్థంచేసుకొన్నవ్యక్తి' అన్నేలక్షణాలు, ముఖపు టస్థికల్పై స్పష్టంగా కనిపిస్తున్నవి.

అతను మెల్లిగా పాకుకుంటూ, దేకుకుంటూ నాదగ్గరి కొచ్చాడు.

"మీరు కొత్తగా వొచ్చారల్లేవుంది. అందుకే మీ చర్మం, మాంసం ఇంకా ఊడిపోలేదు. నిన్నమధ్యాన్నం, పై లోకంలో ఏవో ఏడుపులూ, చప్పుళ్ళూ వినిపించినై. బహుశా అవి మీకు సంబంధించినవే అయివుంటయ్" అన్నాడు ఆ మనిషి పరిశీలనగా నేలనుచ్చూస్తో.

"ఇదేమిటి? ఏలోకమిది? నువ్వు మనిషివే! సందేహం లేదు. ఇక్కడకెందుకొచ్చావు? నేను ఎందుకొచ్చాను?" అన్నాను ఆ మనిషితో.

అతను నవ్వాడు. అమాయకుడైన కొడుకు గోము తనానికి జాలిగా, దయగా నవ్వేతల్లి నవ్వుకుమల్లే వున్నది ఆ నవ్వు.

"నువ్వు చచ్చిపోయావు. నేను చాలాకాలం కిందటనే చచ్చిపొయ్యాను. ఇది చచ్చినవాళ్ళు నివసించే లోకం. దీని ఉపరితలంమీద మనుష్యులు శ్మశానమని పిలిచే ప్రదేశంవుంది యీ లోకంలో వెలుగు చీకట్లు వుండవు. అంతా వెలుగే! అంతా చీకటే!"

"మరి ఉదయం, సాయంత్రాలు ఎట్లా కనుక్కొంటారు? గడియారలున్నయ్యా? లేక కాలాన్ని సూచించే సాధనం—కొత్తరకంది ఏదన్నా సృష్టించుకొన్నారా?" అన్నాను ఆశ్చర్యంతో. అతనుచెప్పే మాటలు నాకేమో విడ్డూరంగా వున్నాయే!

అతను పకపక నవ్వాడు. ఎముకలు గలగలమన్నయ్. చేతి ఎముకలు—అదే చేతిని నా వేపుచూపి తలప్రక్కె వాణి కేట్లు నవ్వాడు. నాకేమో మహా చిన్నతనంవేసింది, నా అజ్ఞానానికి.

"ఎందుకు? కాలంతో మాకెందుకు? ఎప్పుడు పొద్దు పొడిస్తే మాకేం?" అన్నాడు. మీసాలు మెలితిప్పుకొంటున్నట్లుగా. పళ్ళపైగా వేళ్ళ ఎముకలు వేసి రుద్దుకొని.

"మరి పనులు—తిండి—నిద్ర?"

"ఉండు. నాకు తెలుసు. యిక్కడకొచ్చిన ప్రతివారూ మొదట్లో ఈవిధంగా గాభరా పడతారు. నేనూ అంతేగా మొట్టమొదట...మాకూ ఆకలివుంది. అప్పుడు, అదిగో అటు చూడు దూరంగా తళతళా మెరుస్తోవుంది చూశావా!"

అటు చూశాను.

"అక్కడ కెళ్ళటం, ఆ మెరుపులను తినటం, దానికి పక్కగా మసక వెలుగునీడలు వున్నయ్ చూడు..."

"ఆఁ అవునవును...ఏదో అటూఇటూ వూగుతూ... అవేనా?"

"అవును...సరేనా? అవిసీళ్ళు. అవసరం కలిగినప్పుడు అక్కడకెడతాము. నిద్రొస్తే పడుకొంటాము. ఇంక మాకు కాలంతో నిమిత్తమేముంది?"

నాకేదో స్వర్గంలో వున్నట్లుగావుంది.

"మేము అంటున్నావు. ఎంతమంది మీరు? నువ్వొక్కడివే కనపడుతున్నావేం? మిగతావాళ్ళంతా ఏరీ?"

"అక్కడ...అక్కడవున్నారు. ఆ రొదలు, చీకాకులు దౌష్ట్యాలు, ఏడుపులు, జెలసీలు భరించలేక, కాస్తదూరంగా ...ఇక్కడ వుంటున్నాను."

"మనుషుల్లోవున్న ప్రవృత్తులే యివన్నీని. ఇక్కడకూడా యివి వొదల్లేదా?" అన్నాను ఆశ్చర్యపోతూ.

"మేము ఎన్నోయుగాలనుండీ – అసలు 'జీవి' అనేది ఈ భూగోళంమీద వుద్భవించిననాటినుండీ, యీ ప్రవృత్తులు, ఏదో వొకరూపాన, ఏదో ఒక పేరుతో ఈ మనుషుల్లో వుంటూనే వచ్చాయి. ఇవన్నీ మనిషి ఎముకల్లో కలిసిపోయి, విడదీయటానికి వీలులేనంత ప్రబలంగా వున్నప్పుడు; మానవ జన్మ వాసనలను విడవని ఇక్కడ ఎట్లా లేకుండాపోతాయి?" అన్నాడు అతను, నా అజ్ఞానాన్ని సవాలు చేస్తున్నట్లు చూస్తో.

కొన్ని అస్థిపంజరాలు లేచి ఆహారకాంతి దగ్గరకు వెడుతున్నాయి దూరంగా. మరి కొన్ని నీటినీడల దగ్గరకు వెడుతున్నాయి.

"మనంకూడా కొంచెం అటువేపు పోదామా?"

ఇద్దరం వెళ్ళాము. అక్కడ చాలామంది వున్నారు. పురుషులు, స్త్రీలు, పిల్లలు, వృద్ధులు, యువకులు, యువతులు. కొందరు కుటుంబాలుగా వుంటున్నారు, కొందరు విడివిడిగా వుంటున్నారు. కొందరు ఎక్కువచోటు నాక్రమించుకొని వున్నారు, తమ అవసరాలకు మించి. మరికొందరు తమ అవసరాలకు కూడా చాలనంత యిరుకులో యిబ్బందిపడుతున్నారు. తమ అవసరాలకంటే ఎక్కువ వున్న ప్రదేశంలోనికి, లేని వాళ్ళను, వున్నవాళ్ళు రానివ్వటంలేదు. లేనివాళ్ళు వున్న

వాళ్ళ వేపు దీనంగా, బరువుగా, బాధగా, కసిగా, జెలసీగా చూస్తున్నారు. ఎంగిలాకులు నాకుతున్న బలమైన కుక్క వేపు ఆకులు దొరకక దూరంగా నిలబడ్డ బలహీనమైనకుక్క చూస్తున్నట్లుగా చూస్తున్నారు.

అతను వీళ్ళ వేపు చూడడు. పలకడు. వీళ్ళను పురుగులను చూస్తునట్లు—అసలు ఎవరూ లేనట్లే వున్నాడు.

"ఇతను మొదట్లో, షుమారైన స్థితిపరుడు. ఫ్రాళ్ళో తగాదాలు రేపి, రెండుపార్టీల దగ్గిర డబ్బుగుంజి బోలెడు సంపాదించాడు. వడ్డీవ్యాపారం, దొంగవ్యాపారం చేశాడు. ఎన్నో భూములు, ఎన్నో ఇళ్లు ఇతనికున్నయ్. నిజంగా యిన్నీ ఇతని కనవసరం. తనచుట్టూకూడు లేనివాళ్ళు కొంపలేనివాళ్ళు వేలకొద్దీ వున్నప్పటికీ అతను లక్ష్యంచెయ్యలేదు. పచ్చిదోపిడీ గాడు" అన్నాడు నామిత్రుడు అక్కణ్నించి చాలాదూరం వొచ్చిన తరువాత రహస్యంగా నా చెవిలో. నన్నుచూచి చాలామంది సంతోషించారు. కొంతమంది విచారంగా చూచారు. మరి కొంతమంది నా దగ్గిరకొచ్చి చేతులు చాపారు. వాళ్ళు బిచ్చగాళ్ళు గావును.

కొంచెం దూరం పోయేటప్పటికి అక్కడ చాలామంది ఆడవాళ్ళు కూచునివున్నారు. వయస్సులోనివాళ్లు, ముసలి వాళ్లూ వున్నారు. ఒకతను ఎత్తుపాటి దిబ్బమీద కూచుని వున్నాడు. నా మిత్రునివేపు చూశాను.

"వీడు...ఈ వెధవ...స్వాములవారు. దేవుడనీ, మహాత్యాలనీ, పూజలనీ నానా మోసాలు చేస్తుంటాడు. ప్రస్తుతం

ఈ లోకంలో వీడిపలుకుబడి జాస్తిగానే వుంది. కొంతకాలం కిందట కొంతమందియువకులు వీడితో వాదంపెట్టుకొన్నారు. ఆ భౌతికవాదానికి తట్టుకోలేక వాడు రహస్యంగా వాళ్ళను తన్నించి, దేవుడు వాళ్ళ నిట్లాచేశాడని ప్రచారంచేశాడు. నిజానికీ చోటు చాలాతక్కువ. అబద్ధానికీ, మోసానికీ చాలా ఎక్కువ...కోర్కెలను చంపుకోవాలనీ, కామాన్ని జయించాలనీ, అందరికీ చెబుతుంటాడు. పొద్దుగూకటం ఆలస్యం — ఇక తయారు. వొట్టిపశువు. మహాకామోద్రేకి. ఈగుంపులో సగం మందయినా వీడి ప్రియురాళ్ళయివుంటారు...అవును, కొంత కాలంకిందట వొక అమాయకురాలికి 'పరబ్రహ్మస్వరూపం' చూపెడతానని ఏకాంతంగా పిలిచి, తను గుడ్డలు విప్పుకొని, ఆమెనుకూడ విప్పమన్నాట్ట. ఆమె వొప్పుకోకపోతే, శపిస్తానన్నాట్ట — ఆ అమాయకురాలు భయపడి, నిశ్చేష్టయై చూస్తుంటే, వీడే విప్పి. పులిచర్మంమీద పడుకోబెట్టి అనుభవించాట్ట- ఆపిల్ల అరవకుండా నోరుగట్టిగామూసి. మిగతావాళ్ళు ఆమె అదృష్టానికి మహా అసూయపడ్డారు, స్వాములవారిదయ ప్రసరించినందుకు ఆమెమీద. ఇదీ వీడి తతంగం"

మా గుసగుసలు విని స్వాములవారు మావేపుచూసి చేతులుజాడించాడు. సదస్యులందరూ మమ్మల్ని చూశారు. కొంతమంది మా మీదమీదకుకూడా రాసాగారు. ఎందుకా అని ఆలోచిస్తుండగానే, నా మిత్రుడు నాచేయి లంకించుకొని బరబరా చాలాదూరం లాక్కువెళ్లాడు.

"ఏమిటిది?" అన్నాను.

"వాడు కాలాంతకుడు. మనవిషయం పసిగట్టాడు" అన్నాడు నా మిత్రుడు. కాసేపటికి మే మొచ్చిన దిక్కునుండి పెద్దగాసంతోషరావాలు,చప్పట్లులాంటి ధ్వనులు వినిపించాయి.

ఆ చప్పళ్ళు ఇంకా అణగనేలేదు. పెద్దగా ఏడుపు, ఎవరో యింకొకరిని కొడుతున్న దెబ్బలు నా చెవుల్ని వణికించాయి.

"ఇదేమిటి? ఈ ఏడుపెవరిది? వెడదాం రండి! పాపం! ఎవడో దుర్మార్గుడు, ఎవర్నో బాధిస్తున్నాడు. రండి... అయ్యో! అలా చూస్తారేం? రండి...ఊఁ, తొందరగా వెడదాం. చెయిదాటిపోయినతరువాత...కదల్లేం?" అన్నాను నా మిత్రుణ్ని చెయ్యిబట్టుకులాగుతూ. అతను కదలలేదు.

"రండి...రారేం?...పోనీ నేనన్నా వెడతాను..."

అతను గబాలున నా బుజంపట్టుకొని వెనక్కులాగాడు.

"వొద్దు"

"ఏం?"

"అది మనకు సంబంధించింది గాదు"

"అబ్బే! సరిగ్గా వినండి! అదేం! అంత స్పష్టంగా వినిపిస్తుంటే. సందేహంలేదు. అది మనుషుల కంఠ ధ్వనే!"

"అవునను కో...అది భార్యాభర్తల తగాదా. మనకెందుకు?"

"భార్య! ఏంభార్యయితే! అట్లా కొట్టాలా భార్యను"

"ఏంచేస్తాడు! ఏంచెయ్యగలడు? వయసు ముదిరిన తరవాతగూడా, మూడవ భార్యను చేసుకొన్నాడు, బలంలేదు.

వయసులో బాగా అనుభవించిగూడా, తృప్తిలేక యిట్లా అయినాడు. తనకు శక్తిలేదు. తనతోనే వుండమంటాడు. ఎటూ కదలనివ్వడు.”

“మరి కొట్టడం ఎందుకు?” అన్నాను. ఏడుపు ఘోరంగా వినిపిస్తున్నది. నేను వొణికిపోతున్నాను. గుండెలు పగిలేట్టు అట్లా ఏడుస్తున్నా ఎవరూ అడ్డంపోయినట్లులేదు. మా చుట్టూ వున్న మనుష్యుల్లో ఏ మాత్రం సంచలనంలేదు ఆ ఏడుపువల్ల;

“చాలాకాలం అట్లాగే వున్నదట హృదయాన్ని చంపుకొని. కానీ ఎంతకాలం అట్లా వుండటం? ప్రతిరోజూ ఆహారం సమకూర్చే శక్తులు ఏమవుతాయి? ఎక్కడ వినియోగం దానికి? ఏదో వొకతన్ని ప్రేమించింది. అతనితో రహస్యంగా వుంటోంది. వాడు చూశాడు. కొట్టాడు. నానా హింసలూ పెట్టాడు. అన్నీ భరించింది కొంతకాలం. చివరికి భర్త సహించలేక చంపాడు ఆమెని. ముందుగా ఆమె వొచ్చింది ఈలోకంలోకి. వొచ్చి యిక్కడ వొకరితో వుంటున్నది. అసమర్థుడైన భర్తతో ఎండిపోయిన బతుకు బతికి, అదే తలుచుకొంటూ వుండక. సుఖపడుతున్నదనే కచ్చతో ఆమెని వెలివేశారు ఇక్కడ కొంతమంది.”

“కొట్టేది ఆమె ప్రియుడా?”

“అబ్బే! కొంతకాలానికి ఆమెభర్తగూడా వొచ్చాడిక్కడ! ఆమెని చూశాడు. మండిపడ్డాడు. ఆక్రుర వాణ్ని మిగతావాళ్ళ సహాయంతో కొట్టి భార్యను ఆక్రమించుకొన్నాడు. మరి సుఖాన్ని రుచిచూసిన ప్రాణి. ఏం చేస్తుంది? ఇక్కడగూడా రహస్యంగా ప్రణయ జీవితం ప్రారంభించింది...తనకు అవస

రంలేదు. దీన్ని మరొకరు వుపయోగించుకొంటే సహించలేని తత్వం..."

ఇట్లా అతను చెబుతుండగానే వొకయువకుడు మా ముందునుండి బరబరా పరుగెత్తాడు.

"తొరగా రండి"

అంటూ నా మిత్రుడు నన్ను హెచ్చరించాడు.

"హంతకుడా?" అన్నాను, హడలిపోయి".

"వాడే కొంతనయం — వీడు...వీడు వీసు రచయిత. కాస్త తెలిసిన మొఖం కనపడటం భయం. వెకిలిగా యికిలించి ఏదో వొకటి అడుగుతాడు; చివరికి బీడీఅన్నా సరే!"

"ఇక్కడ బీడీలు వుంటాయా"

"లేదనుకో :.. పూర్వపలవాటు ఎక్కడికిపోతుంది? కథలనిండా సంస్కారం కార్చిపారేస్తాడు. ఒట్టిలుచ్చా; మాను గారేదో కట్నమివ్వలేదని భార్యను వొదిలిపెట్టాడు. భటాచోర్ గాడిద..."

అతను బూతులు తిడుతున్నాడు.

"ఆకలవుతోంది" అన్నాను.

నన్ను అన్నందగ్గరికి తీసికెళ్ళాడు. అక్కడ మెరుపులు చాలా వున్నాయి. కొంతమంది వాటిచుట్టూ కావలి తిరుగుతున్నారు. చాలామంది దూరంగావుండి గుటకలు మింగుతున్నారు.

"జాగ్రత్త! వీళ్ళు తిండిదొంగలు. ఏనాటికీ తరగని ఈ రాశి మొత్తం వీళ్ళఆధీనంలో వుంది. వీళ్ళకసుపు నింపుఖ్ఖర్లేదు. ఎదటివాళ్ళు తిండికి మాడుతుంటే ఈ గుంపుకు మహా సంతృప్తి..."

"మనకెట్లా తిండి?" అన్నాను దిగులుపడి.

"ఏదో దొరుకుతుందిలే!" అని నసిగాడు అతను.

అందరితో బాటుకలిసి మేమూ కూచున్నాము...వున్న ట్టుండి జనం గొల్లుమని లేచారు. కాపలావాళ్ళమీద తిరగ బడ్డారు. కాపలా దొంగలు భయపడి, గబగబా యింతఅన్నం తీసి జనంమీద చల్లారు. చల్లినదానికోసం కుక్కలకుమల్లె జనం విరగదొక్కుకుచచ్చారు. కొంతమందికి అసలు చిక్కనే లేదు. చిక్కినవాళ్ళు నవ్వుతో వెళ్ళిపోయినారు. మిగతా వాళ్ళు యింకా అన్నంవేపు ఆతృతగా చూస్తోనే వున్నారు. మేమూ కాస్త చిక్కించుకొని, తిని, నీళ్ళుతాగి బైటపడ్డాము.

"పడుకొందామా" అన్నాడు మిత్రుడు.

"ఏ"

కాసేపుండి —

"మరిచాను...మీపేరేమిటి?" అన్నాడు. చెప్పాను.

ఏదో భూతం మింగటానికి వొచ్చినట్లుగా చివాలున లేచి,—"నువ్వు— నువ్వు—కథలు రాస్తావా? రచయితవా?" అన్నాడు.

"అవును" అన్నానుగర్వంగా. ఈసమాధానంవింటూనే నా మిత్రుడు పరుగెత్తి అదృశ్యమయ్యాడు. నవ్వుకొని చుట్టూ చూశాను. పసుపుపచ్చని సుందరకాంతిదప్ప మనుషు లెవరూ నాకు కనిపించలేదు.



# అభ్యుదయం

నేను ఇంత గుంటడప్పణ్ణుంచీ రంగయ్యగారిని ఎరుగుదును. ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపకం. ఓరోజు సాయంతం రంగయ్యగారు మాయింటికొచ్చాడు. మానాన్న వసారాలో కూచుని ఎవరితోటో మాట్లాడుతున్నాడు. మా నాన్న—కొత్త గనక రంగయ్యగార్ని పలకరించలేదు. ఇదే కారణంతో రంగయ్యగారూ పలకలేదు. 'గారు' అని ఈ మధ్య అనటమేగానీ, అయిదారేళ్ల క్రిందట అందరూ అతన్ని రంగయ్యనే అనేవాళ్ళు—రంగడనీ, రంగన్ననీ, రంగాయనీ అన్నవాళ్ళూ ఉన్నారు. అది వేరేవిషయం!

అంతా వెళ్ళిపోయారు. రంగయ్య మాత్రం అట్లాగే చేతులు కట్టుకొని నిలబడ్డాడు మా నాన్న పోతూ, పోతూ 'ఏమి' టన్నాడు. రంగయ్య సగందాకా వంగి దణ్ణంపెట్టాడు.

"మాది సత్తెనపల్లి" అన్నాడు రంగయ్య. "గింపెడు సంతు ఉన్నవాణ్ణి. మొన్న మొన్నటిదాకా వ్యాపారంచేసి బతికాను. వ్యాపారంలోనష్టాలొచ్చాయి. కొంపాగోడీ బాకీదార్లకిచ్చి ఊరూరూ తిరుగుతూ ఇక్కడికొచ్చాను. బాబు ధర్మమూర్తులనీ, దయాపరులనీ, మోతుబరులనీ విన్నాను. నన్ను రక్షించండి. నా బిడ్డలకింత ఆధరువు చూపించండి"

"నన్నేంచెయ్యమంటా" వన్నాడు మా నాన్న.

"వ్యాపారం చేసుకొని బ్రతుకుతాను. మా కులమే వ్యాపారకులం. కొట్టుగూడా తమ ఇంటికి దాపులోనే పెడదామనుకుంటున్నాను. తమ వాడకమంతా మన కొట్లోనే వాడు

కోండి. మీరు ఎవరెవరి కివ్వమంటే వారికల్లా అప్పు యిస్తాను.” అన్నాడు రంగయ్య.

ఇంతలో మా నాన్న చేయవలసిన సాయమేమిటో నాకు తోచలేదు. ఈ మాటే నాయనగారుకూడా అన్నారు.

“అమ్మమ్మా! అలాఅనకండి. తమవంటి గొప్పవారి సాయం లేకపోతే నేను మట్టికొట్టుకుపోనూ!”

అంతటితో ఆఖరూ!

అనుకొన్నట్టుగానే రంగయ్యగారు కొట్టుపెట్టారు. కొట్టంటే పెద్దకొట్టేమీకాదు ఉప్పు, చింతపండు, మిర్చి, నూనెలు, చిల్లరదినుసులు మసాలాసామాన్లు...ఇట్లాంటివి కొద్దికొద్దిగా ఉండేవి. పట్టుమని వందరూపాయల సరుకుగూడా ఉండేదిగాదు. ఈచిన్నకొట్లో మా క్కావలసిందేమీ దొరికేదికాదు. మేమేమీ కొనేవాళ్ళమూకాదు. కొనలేదని రంగయ్య ఎప్పుడూ అడగలేదు. మేమేకో విపరీతమైన సాయం చేస్తున్నట్టే మాట్లాడేవాడు.

పల్లెటూళ్లో ఈనాటికీ, డబ్బుమారకంకంటే వస్తువుల మారకం అధికంగా ఉంటుంది. రెండుబస్తాల వడ్లు తీసుకొని, బస్తా పచ్చజొన్నలెవరైనా ఇస్తారు. గింజలు ఇచ్చి చిల్లర వెచ్చం, ఏ కొట్లోనైనా తెచ్చుకోవచ్చు. రంగయ్య ఈపద్ధతే అవలంబించాడు. అతని గల్లాలో డబ్బయితే ఉండేదికాదు గానీ, ఇంటినిండా గింజలుండేవి. మూడుగిద్దల వడ్లకు, గిద్దెడు సెనగపప్పుకే, పన్నెండు తిమ్మెరబిళ్ళలు, ఇరవైనాలుగు నిమ్మతొనలూ రంగయ్య ఇచ్చేవాడు. గిద్దెడు జొన్నలిస్తే ఒక్క బలపమిస్తాడు. పెన్సిలుకు తవ్వెడు పుచ్చుకునేవాడు.

రెండు నెలలయ్యేసరికి రంగయ్యా ఇంటినిండా గింజలే. వాటిని బళ్ళకెత్తించి బస్తీలో అమ్మేవాడు. వచ్చేప్పుడు ఆ బళ్ళమీదనే, చవక రేట్లకు సరుకులు వేసుకొచ్చేవాడు. దీని వల్ల రంగయ్యా రెండువిధాల లాభించేవాడు. ఒకటి ఊళ్ళో ధాన్యాన్ని చవక రేటులోకొని, ఎక్కువధరకు బస్తీలో అమ్మడం. రెండు సరుకులమీద న్యాయంగా వేసుకోవలసిన లాభాలు.

రంగయ్యాకు ఆరుగురు పిల్లలున్నారు. పెద్దవాడు కొట్లో కూచుంటాడు. పెద్దదీ, రెండోదీ పెళ్ళిళ్ళు చేసుకొని అత్తిళ్ళకెళ్ళారు. మూడోవాడు చదువుకుంటున్నాడు కడమ ఇద్దరూ చిన్నోళ్ళు. అయినా రంగయ్యా భార్య ఇంటినే అట్టిపెట్టుకొని ఉండలేదు. పకోడీలు, కారప్పూస, పప్పుచెక్క పల్లికలో వేసుకుని ఊరంతా తిరిగి అమ్మేది. పనిలోపనిగా, ఎక్కడ పేడ చిదప కనిపించినా పట్టుకొచ్చేది.

ఆవిడపరంగా పది ఖాతాలున్నాయి. అధమపక్షం నెల పక్కింటికి ఆపడిఖాతాలు పదిపదులు– నూరు చెల్లించేవి.

రెండోవాణ్ణి చదువు మానిపించాడు రంగయ్యా. ఇదేమిటని ఎవరైనా అడిగితే :–

"ఆ...మీబోటి మారాజులగ్గానీ...చచ్చులిపాయలమ్ముకునే మాకెందుకండీ చదువూ? ఉద్యోగాలు చేస్తామా, ఊళ్ళేలతామా?" అనేవాడు రంగయ్యా.

ఇప్పుడు ఊళ్ళో పెద్దవారిఖాతాలన్నీ రంగయ్యాగారు సంపాదించాడు. ఆ యిళ్ళవాళ్ళు కొట్టుకొచ్చి సరుకులు పట్టుకెళ్ళనవసరంలేదు. రంగయ్యాగారే స్వయంగా పట్టుకెళ్ళి

ఇచ్చేవాడు. ఎవరెవరికి ఏమేమి కావలసిందీ, ఎప్పుడుకావల సిందీ నిత్యమూ కనుక్కొంటుండడమూ, అవి సప్లయిచేయు టమూ అతనిడ్యూటీ! ఇటీవల రంగయ్యగారు బస్తీకెళ్ళడం మానుకొన్నాడు. పెద్దవాడే అవన్నీ చూస్తున్నాడు. చిన్న వాడు కొట్లోకూచుంటున్నాడు. అద్దెకొంపేలవుగాక, కాస్తంత పెద్దది చేసుకొన్నాడు. వ్యాపారాన్ని పెద్దదిచేశాడు.

ఈనాడు ధాన్యం అమ్మడానికి మాపూళ్ళో ఎవ్వరూ బస్తీ కెళ్లడంలేదు. ఎందుకు? బస్తీధరమీద రూపాయకు బేడలుతగ్గించి రంగయ్యగారేకొంటారు. బస్తీకెళ్ళినా ఖర్చులు మట్టి- మశానమూ కలిసి ఆ ధరే గిట్టుబాటవుతుంది. అయినా వెళ్ళంగానే డబ్బుచేతిలోపడ దక్కడ. రంగయ్యగార దేమీ లేదు. ధాన్యంకొలత కాగానే, డబ్బు ముద్దరపద్దిగా ముట్ట చెబుతాడు. అతని తూనిక పెద్దదని కిట్టనివాళ్ళు అంటారు గానీ, అది నిజంకాదు.

ఇంతలో యుద్ధంవచ్చింది. సరుకులకు విపరీతంగా ధరలు పెరిగాయి. మార్కెట్లో డబ్బున్నది. సరుకులే లేవు. అయినా తన ఖాతాదార్లకు ఏ సరుకూ లేదనకుండా సప్లయిచేశాడు రంగయ్య. ఎక్కడా కిరసనాలు లేనిరోజున పాతికడబ్బాలు కావాలంటే తెప్పిస్తాడు. మందులోకి పంచదార దొరక్క పోయిందా — రంగయ్యనడిగితే, ఆరుబస్తాలు తెచ్చిస్తాడు. కాకపోతే, కంట్రోలు రేట్లకు నాలుగురెట్లు, ఐదురెట్లు ఎక్కువ పుచ్చుకొనేవాడు. అయినా, అతనిదేం తప్పుంది? అసలు బస్తీ లోనే రేట్లు మండిపోతుంటే రంగయ్యేంచేస్తాడు పాపం!

రంగయ్యభార్య గూడా ఈ విషయంలో భర్తకు

యథాశక్తి తోడుపడుతుండేది. లాంగ్ క్లాత్ తాన్లు, గ్లాస్కో పంచలు, తట్టల్లో పెట్టుకుని, ఇంటింటికీ తిరిగి అమ్మేది.

రంగయ్యగారికి రాజకీయాలంటూ లేవు. అన్ని పార్టీలు అతనికి అభిమానమైనవే! కానయితే, కమ్యూనిస్టులంటే మాత్రం రవంత కంటుగా ఉండేది. అయితే అదెక్కడా బైట పడనిచ్చేవాడు గాదు. అదయినా ఎందుకొచ్చిందీ? దొంగ వ్యాపారం చేస్తుంటే పోలీసులకు వాళ్ళుపట్టిచ్చారని. పోలీసులు బుద్ధిమంతులుగనక, పరువు మర్యాదలు ఆలోచించే వారుగనక, పాతిక్కో పరక్కో పుచ్చుకొని కేసును తొక్కిపారే శారు. లేకపోతే రంగయ్య ఎంత హైరానాపడవలసివచ్చేదీ! అందుకుతోడు వూళ్ళో పెద్దలుగూడా అతనికి అండగా నిల బడ్డారు. గండంగడచి పిండంబైటబడ్డది.

రంగయ్యగారు ఏపార్టీఅయిందీ 1947 ఆగస్టుదాకా స్పష్టంగా తెలీదు. తొలిసారిగా ఆయనఇంటిమీద కాంగ్రెసు జండా ఎగరడం నా కంత ఆశ్చర్యం కలిగించలేదు. ఎప్పుడో ఒకప్పుడు ఇలాంటి ఘనకార్యం రంగయ్యగారు చేస్తారని, నేను చాలాకాలంక్రిందటే ఊహించాను. చాలా విషయా ల్లోలాగే, ఈవిషయంలోగూడా నా అంచనా తప్పలేదు. అంద రితోబాటు ఆయనగూడా జండాబట్టుకొని తిరిగాడు. జేజేలు కొట్టాడు. తనవాళ్ళచేత జేజేలు కొట్టించుకొన్నాడు. ఆనాడు ఎగరేసిన జాతీయపతాకం, ఈనాటికీ రంగయ్యగా రింటిని అలంకరిస్తూనే ఉన్నది.

స్వాతంత్ర్యం వచ్చినతరువాత, మావూరు చాలా మంది నాయకులు రావటం సాగించారు. ఇదివరకు మా

యింట్లో మకాంవేస్తుండేవారు. ఇపుడు రంగయ్యగారే, వారికి ఆతిథ్యమివ్వసాగారు. కాంగ్రెసునిధికి ఆయన భూరి విరాళ మివ్వటమే గాకుండా, పదిమందిచేత ఇప్పించాడుగూడాను. రాష్ట్రంలో మనప్రభుత్వాలు ఏర్పడినతరువాత, రెండు బస్సురూట్లు సంపాదించాడు. ఆయనకూ, ఇంకో ఎమ్. ఎల్. ఏ. గారికీ అందులో వాటాలున్నాయని ఊరంతా అనుకొన్నారు. రంగయ్యగారు, దాన్ని పూర్తిగా వ్యతిరేకించాడు. ఎవరో గిట్టనివారు పుట్టించిన పుకారన్నాడు. రంగయ్యలాంటి దేశభక్తునిమాట విశ్వసించకపోవడమా? ఎంతతప్పు!

అయితే ఆయనకొంపలోనే ముసలంబుట్టింది. మొన్నటి ఎన్నికల్లో రంగయ్యగారి పెద్దకొడుకు, కమ్యూనిస్టుల తరఫున పనిచేశాడు. ఆయనగారింటిమీద కమ్యూనిస్టుజండా ఎగిరింది. ఎవరన్నా అడిగితే, రంగయ్యగారు, నవ్వి వూరుకొనేవాడు.

"బాబూ! ఈకాలపు కుర్రకారుకు సమాధానం చెప్పలేం! వాడిపిచ్చి వాడిదీ!" అన్నాడు రంగయ్యగారు.

రంగయ్యగారు కాంగ్రెసుతరఫున ప్రచారంచేస్తే, కొడుకు కమ్యూనిస్టుల పక్షాన పనిచేశాడు. ఎన్నికల్లో కమ్యూనిస్టులు "మట్టికొట్టుకు" పోయారు. రంగయ్య ఇంటిమీద ఎర్రజండా తిరిగి కనపళ్ళేదు. ఒకరోజుదినపత్రికలో రంగయ్య పెద్దకొడుకు సుదీర్ఘమైన ప్రకటనచేశాడు. అందులో తననుకమ్యూనిస్టులు ఎట్లా మోసగించిందీ వైనవైనాలుగా వర్ణించాడు.

"కొడుకు ఆముదనష్టపువాళ్ళతోకలిసి "చెడి"పోయ్యాడనుకొన్నాను. కాదు. బాగుపడ్డాడు. నాక్కావలసిందిగూడా అదే" అన్నాడు రంగయ్య.

# కడుపుతీపి

రాత్రి పదిగంటలు దాటింది. ఆశ్రమమంతా నిశ్శబ్దంగా వుంది. ఆనందస్వామి కుర్చీలో అటూ ఇటూ కదిలాడు. ఆలోచనలు ప్రవాహంగా సాగారిపోతున్నాయి. అల్లంత దూరంలో శకుంతల నిద్రపోతున్నది. ఆ పిల్ల వేపు చూస్తుంటే ఆయనకు ఎన్నో సంగతులు జ్ఞప్తికి రానారంభించాయి...

ఆరోజు తనింకా నిద్ర లేవలేదు. రంగన్న వచ్చి తలుపు తట్టాడు. పోయి చూస్తే, ఆశ్రమద్వారం దగ్గర ఒక పసిగుడ్డు పొత్తిళ్ళలో ఉంది. అమసగ చీకట్లో, చుట్టు ప్రక్కల వెదికారు. ఎక్కడా ఎవరూ కనిపించలేదు. ఆ పసిగుడ్డు పొత్తిళ్ళలో చిన్న ఉత్తరమొకటి ఉంది. దాన్ని చదువుతూనే, తను కూలిపోయాడు. తన హృదయం కారుణ్యంతో కరిగిపోయింది. ఎవరో అనాథట. అనివార్య పరిస్థితుల్లో ఈ బిడ్డను ఇక్కడ వదులుతున్నాననీ, రక్షించమనీ, ఆ తల్లి పదేపదే ప్రార్థించింది. ఆ వుత్తరంలోని ప్రతి పంక్తిలోనూ, ఆ మాతృహృదయం తనకు గోచరించింది. ఆనాటి నుండే తన ఆశ్రయాన్ని అనాథ శరణాలయంగా మార్చాడు. ఈ పదహారు సంవత్సరాల లోనూ, ఎంతోమందికి ఈ శరణాలయం ఆశ్రయమిచ్చింది. బూదిపాలుకావలసిన ఎన్నోజీవితాలను పునరుద్ధరించింది. వారివైపు చూస్తుంటే తనకు కలిగే ఆనందం ఏ ఔన్నత్యం చేతా సాధింప రానిది!

కన్నవారికి దూరమై, వారి అనురాగానికి నోచుకోని వారందరికీ తనే తండ్రి అయ్యాడు. పితృప్రేమలోని మాధుర్యం

తనకు అవగతమైంది. ఒక్కరొక్కరే దాటిపోతుంటే, తన మనస్సు ఎంతో బాధపడుతుండేది. వారిని విడిచి వుండలేక, ప్రాణం గిలగిలలాడేది. కానీ ప్రపంచ ధర్మాన్ని తప్పడానికి వీలులేదుగదా...

రేపటితో శకుంతలగూడా వెళ్ళిపోతుంది. ఆ మాట జ్ఞప్తికొచ్చినపుడల్లా, తను దుఃఖాన్ని ఆచుకోలేకపోతున్నాడు. నిజానికి శకుంతల తన కన్నబిడ్డకాదు—ఆ మాటకొస్తే ఇక్కడున్న వందమందిలోనూ ఎవరు తన బిడ్డలు! కానీ, అందరిదారీ వేరు, శకుంతలదారి వేరు. తన నీ మహోన్మాద్యమానికి పురిగొల్పింది శకుంతల; ఆనాడు – ఆశ్రమద్వారం దగ్గర – ఈమె పడి ఉండనట్లయితే, తనా అలౌకిక జగత్తులోనే కొట్టుమిట్టాడుతుండేవాడు. దానివల్ల – తనకు తానుగా ఏమన్నా ఫలితంపొందితే పొందుగాక; లోకానికి తనవల్ల, ఎలాంటి ఉపయోగమూ ఉండేది కాదు. అలాంటి 'ప్రమాదం' నుండి, తనను మరల్చి, లోకసేవవైపు దృష్టి సారించడానికి ముఖ్యకారణం శకుంతల. అందుకే ఆమెఅంటే తనకెంతో అనురాగమూ, ఆపేక్షానూ!

తను 'అభిజ్ఞాన శాకుంతల' చదువుతున్నప్పుడు, కాళిదాసు ప్రతిభకూ, శిల్ప చాతుర్యానికీ మురిసిపోయాడు గానీ, అందులో అభివర్ణితమైన మానవత్వాన్ని గుర్తించలేకపోయాడు. కణ్వమహర్షి, ఆ శకుంతలను విడనాడటానికి పడిన బాధ, ఇప్పుడు తనకు అనుభవమవుతోంది! పెంచిన అనురాగమే తన నిలా విచలితం చేస్తున్నదే, నిజంగా కన్నవారి గుండెలు, ఆ క్షణాన ఎలా ఉంటాయో, తన కెలా తెలుస్తుంది?

శకుంతల తల్లి జీవించే ఉన్నదని తనకు తెలుసు. లేక పోతే ప్రతీ ఉగాదికీ ఆమెకు శుభాకాంక్షలు, కానుకలు రావు. ఆ తల్లిని తెలుసుకొందుకు తను చాలా ప్రయత్నాలు చేశాడు. కానీ, ఒక్కటీ ఫలించలేదు. విసుగెత్తి మానేశాడు. తలవని తలంపుగా నిన్న ప్రసాదు వచ్చాడు. తను శకుంతలకు అన్నగారి నన్నాడు. అన్ని విషయాలూ దాచకుండా తనకు చెప్పాడతను.

రేపు శకుంతల తన అన్నగారితో వెళ్ళిపోతుంది. చాలా సంవత్సరాల తరువాతనైనా తన ఆప్తులను కలుసుకొన్నందుకు శకుంతల అదృష్టవంతురాలనే చెప్పాలి! కానీ ఆమె తన నుండి పోతున్నదనే బాధమాత్రం—భరించరానిదే!...

*　　*　　*　　*

తెల్లవారింది. ప్రయాణ సన్నాహాలన్నీ పూర్తి అయ్యాయి. ఆశ్రమంలోనివారంతా బండి చుట్టూ మూగారు. ఆనందస్వామి కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరుగుతున్నాయి. శకుంతల గూడా అంతకు తక్కువ స్థితిలో లేదు. బండి మనిషి తొందరచేస్తున్నాడు. శకుంతల బండెక్కింది. ప్రసాదూ ఎక్కాడు. బండి సాగింది. ఆనందస్వామి రెండుచేతులతోనూ ముఖం కప్పుకున్నాడు.

## 2

పచ్చని పొలాలమీది నుండి, చల్లటి గాలి వీస్తున్నది. రైలు కుదుపుతో ముందుకు దూసుకెడుతున్నది. శకుంతల పరుపుచుట్టకానుకొని నిద్రపోతున్నది. ప్రసాదు ఆమెకేసే చూస్తున్నాడు. అతని కళ్ళు నీటితో నిండిపోయాయి. ఎవ్వరూ

చూడకుండా వస్తున్నాడు. తనకో చెల్లెలున్నదన్న సంగతి మొన్న మొన్నటిదాకా తెలీదు. ప్రయోజకుడైన అన్నగా రుండిగూడా, ఆమె అనాధలాగా, ఆశ్రమంలో పెరగవలసి వచ్చింది; దీని కెవరు కారణమని తను తర్కించి ప్రయోజనం లేదు. అందరూ కారణమే!

గతించినదేదో గతించింది. దాన్ని గురించి ఇప్పుడు విచారించి లాభంలేదు. ఏది ఏమయినప్పటికీ—తను ఈ నాటికైనా తన చెల్లిని కలుసుకున్నాడు. ఇంత సులభంగా పని నెరవేరుతుందని, తను అనుకోలేదు. తను చెప్పిన వాటినన్నింటినీ స్వామి నమ్మారు. తనవెంట పంపించారు. దుర దృష్టవశాత్తూ ఈ బిడ్డను చూసుకోవడానికి అమ్మ బ్రతికిలేదు, ఉంటే ఎంత సంతోషిస్తుందో!

తనకో చెల్లెలున్నదనీ, ఇంత కాలమూ ఆ చెల్లెలు అనాధాశ్రమంలో పెరిగిందనీ అక్కకు తెలిస్తే—ఎంత బాధ పడుతుంది! ఎంతసంతోషిస్తుంది! తిరుగా తనీ ప్రాంతం రావడమనేది ఇంతలో సాధ్యపడదు. అదీగాక, శకుంతలకు తనవారినందరినీ ముందు పరిచయంచేయాలి. ఈ ఉద్దేశంతోనే శకుంతలకు తన అభిప్రాయాన్ని చెప్పాడు ప్రసాదు. శకుంతల గూడా అందు కంగీకరించింది.

* * * *

వస్తుతః సుభద్రమనస్తత్వం చాలా చిత్రమైంది. ఆమెకు, ఎదుటివారు నిజం చెబుతున్నారన్న నమ్మకం, అంతగా లేదు. అందుక్కారణం, ఆమెకు నిజంచెప్పే అలవాటు లేకపోవడమేనని, ఎవరన్నా అంటే సుభద్ర ఒప్పుకోదు. ఎదుటివారు ఏదైతే

చెపుతారో, దానికి విరుద్ధమైనదాన్నే ఆమె భావిస్తుంది. ఎదుటివారు అన్నం తినలేదని చెబితే, సుభద్ర వాళ్ళు తిన్నారని చప్పున నిర్ణయించేస్తుంది! ఆమె కదో జబ్బు.

అటువంటిదే ఈనాడూ జరిగింది.

ప్రసాదును చూస్తూనే ఆమె మొఖం విప్పారింది. శకుంతలను చూస్తూనే ముడుచుకుపోయింది. తన తమ్ముడు, శకుంతల పట్ల ప్రవర్తించే విధానం ఆమె కేంతమాత్రం నచ్చలేదు. ఇంతకాలం. వాడి కిలాంటి జులాయివేషాలు లేవనుకొంది సుభద్ర. శకుంతలను చూడడంగానే, ఆ భ్రమ కాస్తా విచ్చిపోయింది. ఇలాంటివాడు తనబిడ్డ నేం చేసుకొంటాడు? చేసుకొన్నా ఏం సుఖపెడతాడు? పైగా పాపపుణ్యాలు కూడా విచారించకుండా ఆ పిల్లను 'చెల్లి' అంటున్నాడు! ఇలా అని లోకంకళ్ళు గప్పాలని వాడి అభిప్రాయం కావచ్చు. కానీ తను దాన్ని నమ్మదు.

గోపాలం భార్యను చాటుకు పిలిచి, ఆ పిల్ల ఎవరని అడిగాడు. సుభద్ర జవాబు చెప్పలేదు. ఏమని చెబుతుంది? తన తమ్ముడు లేపుకొచ్చినమనిషని చెబుతుందా? ఆ మాట విన్న తరవాత, ఆయన గడియసేపు వాణ్ని ఇంట్లో ఉండనిస్తాడా? మళ్ళీ ఈ గడప తొక్కనిస్తాడా? ఎవత్తో గుడిసేటిదానికోసం, తమ్ముడు భవిష్యత్తంతా నాశనం చేయడం సుభద్ర కిష్టంలేదు. అందుకే భర్తకు ఏదో సర్ది చెప్పింది. ఆయనగారేదో గొణుక్కున్నాడు.

ఇదింతటితో పోదని సుభద్ర నమ్మకం. ఇప్పుడే వాణ్ని తగిన కట్టుదిట్టాల్లో పెట్టకపోతే, మరో నాలుగు రోజులకు

చేతికి అక్కరకు రాకుండా పోతాడు. ఒక్కగానొక్క తమ్ముడు! వాడిలా, ఎందుకూ కాకుండా మట్టిగొట్టుకుపోతుంటే, సుభద్ర చూస్తూ ఊరుకోలేదు.

తమ్ముడికి నయానా భయానా చెప్పి చూసింది. వాడి మనస్సును శకుంతలమీదనుండి తిప్పడానికి, శక్తివంచన లేకుండా పాటుబడింది! శకుంతల, ఏమందులమందు పెట్టిందో గాని. ప్రసాదు తన మాటను వినిపించుకోనేలేదు. అంతే — ఇప్పటికే, బాగా వేళ్ళు పాతుకొన్నాయన్నమాట!

దీనికితోడు గోపాలం పోటు ఎక్కువైంది. అతను సుభద్రను గుచ్చిగుచ్చి అడుగుతున్నాడు. ఇలాంటి వెధవ్వేషాలు తనింట్లో సాగడానికి వీల్లేదన్నాడు. బంధుత్వముంటే, బంధుత్వం లాగే ఉండాలి గానీ. తనకొంప సానికొంపగా మార్చరాదన్నాడు. అంతగా ప్రేమ కొట్టుకుపోతుంటే — ఇంకెక్కడన్నా అఘోరించక, తన కొంపలోకి చేరడమెందు కన్నాడు.

సుభద్ర వీటికేమీ అనలేదు. నిజానికీ మాటలు సుభద్ర నన్నవి కాదు; ప్రసాదుకు సంబంధించినవి. అంచేత ఆమె ఎటూ మాట్లాడకుండా ఊరుకొంది. సమాధానం చెప్పవలసిన ప్రసాదు మౌనంగా ఉండిపోయాడు. ఈ మాటలు ఎంత తీవ్రంగా పనిచెయ్యాలో, అంతగానూ చేశాయి. శకుంతల స్థితి మరీ దారుణంగా ఉంది.

రైల్లో వస్తున్నప్పుడు, అన్నయ్య — అదే, ప్రసాదు — అక్కను చూడడానికి దిగుదామన్నప్పుడు, శకుంతల సంబరపడ్డది. ఆమె మనస్సు ఆనందంతో నిండిపోయింది. ఇటీవలిదాకా, తనకు దిక్కూ మొక్కూ లేదనుకొంది శకుంతల.

తల్లి ప్రేమకు, తండ్రి అనురాగానికి నోచుకోని, నిర్భాగ్యురాల ననుకొంది. తన కీ జన్మలో ఆ అదృష్టం లేదని, ఎన్నో సార్లు కుమిలి కుమిలి ఏడ్చింది. తన ఏడుపు వినేదెవరు ? విని ఓదార్చేదెవరు ? అక్కడ వున్నవారంతా, తనలాంటివారే కావడంతో, ఒకరి నొకరు ఓదార్చుకోవలసివచ్చేది.

ప్రసాదు వచ్చేదాకా, తన కో అన్నగా రున్నాడని తెలియదు. తెలిసిన తరువాత తను పొందిన ఆనందం అనంతమైనది. ప్రపంచాధిపత్యం లభించినా, తన కలాంటిహాయి, తృప్తి కలిగేవి కాదు. 'నా' అనే దిక్కులేని తనకు; ఓ బంధువు—బంధువే కాదు—తోబుట్టువు లభించాడు. అంతకన్నా తనకు కావలసిందేమీ లేదనుకొన్నది. ఇంతకాలమూ ఎండారిపోయిన తన హృదయంలో, ఏవో అమృతపు సోనలు వర్షించినట్లయింది.

తనీ ఆనందానికే తబ్బిబ్బయిపోతుంటే, ప్రసాదు తనకో అక్కగూడా ఉందన్నాడు. కొన్ని క్షణాలు తనను తనే నమ్మలేకపోయింది. ఇదంతా స్వప్నమేమోననీ, మెలకువ రాగానే ఈకల కరిగిపోతుందేమోననీ, తెను భయపడింది. అన్నగారు దొరికినందుకే, ఆనందభరితురాలైన తను, అక్కగారు గూడా ఉన్నారని విని మహదానందంలో మునిగిపోయింది. ఆ ఆనందోద్వేగానికి, తను తట్టుకోలేకపోయింది...

ఎంతో ఆప్యాయంగా, సంవత్సరాల తరబడి తనలో నిద్రిస్తున్న అనురాగాన్నంతా జాగరితంచేసుకొని, ఉద్వేగంతో, తడబడుతున్న అడుగులతో, అక్కను ఆలింగనం చేసుకోబోయింది. అక్కను చూడగలిగినందుకు తనెంత

తనెంత సంబరపడ్డదో, తనను చూడటానికి అక్కగారు అంతే తొందరపడుతూ ఉంటుందని – తను అనుకొన్నది...కానీ తనను చూస్తూనే అక్కయ్య, ముఖం గంటు పెట్టుకుంది. ప్రసాదును ఎంతో ఆప్యాయంగా పలుకరించిన అక్కయ్య, తన వైపు ఓక 'విషపుచూపు' చూసి, గిరుక్కున లోపలి కెళ్ళిపోయింది. తను అన్న వేపు చూసింది. అన్న అదోలా ఉన్నాడు! తన మనస్సు తీవ్రంగా గాయపడ్డది. అమూల్యమయిన దేమిటో కోల్పోతున్నట్లుగా, తన మనస్సు గిజగిజలాడింది.

——కారణం చూచాయగా తెలియవచ్చింది! తను చాలా పొరబాటు చేసినట్లు ఆలస్యంగా గ్రహించింది. లోకంలో, ఇలాంటి మోసకారులూ, దగాకోరులూ, లుచ్చాలు ఉంటారని, తనకు తెలీదు. తెలిస్తే, తను ప్రసాదు వెంట రాదు. తను సరేసరి–స్వామివారు గూడా, ఈ వలలో చిక్కుకున్నారు. వీడిమాటలు విని, వీడు నిజంగా తనకు అన్నగారేననినమ్మి, తనను వీడి వెంట పంపించారు. ఎన్నో ఆశలతో, స్వప్నాలతో, ఆనందాలతో, తను ప్రసాదు వెంట వచ్చింది! అవన్నీ నామరూపాలు లేకుండాపోవడానికి, ఎక్కువసేపు పట్టలేదు...

ఈ అక్కగారి మాటలను బట్టే, ప్రసాదు తనసెందుకు తీసుకొచ్చిందీ తెలిసిపోయింది. ఇప్పుడు తనేమిటి చెయ్యాడం?

శకుంతల కేమీ తోచలేదు. రెండు చేతులతోనూ ముఖాన్ని కప్పుకొని బావురుమని ఏడ్చింది.

'ఎందుకు చెల్లీ ఏడుస్తున్నావ్?' అన్నాడు ప్రసాదు.

శకుంతల మాట్లాడలేదు. ఏడుపు మానసూ లేదు. అత నికి దూరంగా మాత్రం జరిగింది.

'ఊరుకో చెల్లీ! అక్కయ్య బావగారూ నన్నింకా అర్థంచేసుకోలేదు. అందుకే, వారలా అపోహపడ్డారు. తెలిసీ తెలియక, ఏదో అన్నారు! అందుకోసం నువ్విలా మనస్సు కష్టపెట్టుకోవడం బాగా లేదమ్మా! నామాటవిను-నువ్వేమీ అనుకోకు. పెద్దవారు-మననోమాట అనదగ్గవారు-అక్క కోప్పడితే, చెల్లెలు ఇలా ఏడవడం బావుంటుందా?' అన్నాడు ప్రసాదు, ఉబుకుతున్న కన్నీటిని ఆపుకొంటూ.

'మీరేమీ మాట్లాడకండి! నాకన్నీ తెలును. మీారి లాంటి నీచులని తెలిస్తే, స్వామివారు మీాతో పంపిఉండరు. ఎన్నో కల్లబొల్లి మాటలను చెప్పారు. కళ్ళంట నీళ్ళుగూడా పెట్టుకొన్నారు. మీా నటనచూసి, అందరూ నిజమే ననుకొ న్నారు ..నన్నిలా ఎందుకు నాశనంచేస్తారు? నేనుచేసిన అప రాధ మేమిటి?...ప్రసాదుగారూ! తల్లీతండ్రీ లేనిదాన్ని, ఏ దిక్కూలేని అనాథను, నన్నిలా మోసగించడం ధర్మంకాదు! మీాకూ తోబుట్టువున్నది. ఆమె నెవరైనా, ఇలా నమ్మించి మోసగిస్తే, మీా హృదయం ఎలా ఉంటుంది? నాకెవ్వరూ లేర నేగదా, ఇలా సాహసించారు!...మీారింకేమీ మాట్లాడ కండి! నాకంతా తెలుసు.నాదోవన నన్ను పోనీండి!'

ప్రసాద్ కొన్ని నిమిషాలు ఏమీ మాట్లాడలేదు. ఉన్న ట్టుండి అతని ముఖం కందిపోయింది. కన్నులు నిప్పుగోళ్ళల్లా ఎర్రబడ్డాయి. మనిషి నిలువునా వణికిపోతున్నాడు. గిరుక్కున తిరిగి చకచకా అక్కగదివైపు నడిచాడు.

'అంతా విన్నాను!' అన్నది సుభద్ర. 'ఏం దూకుడుగా వచ్చావ్! కొడదామనా? పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకు. తమ్ముడివిగదా అనీ, నాఅంతవాడివిగదా అనీ, మాటల్తో పోనిస్తున్నాను. నా కంఠంలో ఊపిరుండగా నిన్నా శకుంతలతో ఉండనివ్వను!...పైగా నువ్వేదో మోసంచేశావంటుందేమి టాభడవ! మోసగించింది అదే! బంగారంలాంటి కుర్రవాడికి మతి విరిచి వాజమ్మను చేసి కూచోబెట్టింది. ఇంకో రెండురోజులు పోతే, నిన్నే అయిపులేకుండా చేసినా చేస్తుంది. ఎంత టక్కులాడి కాకపోతే, నిన్నిలా కీలుబొమ్మను చేసి ఆడిస్తుందీ! గంగిగోవులాంటి వాడిని – ఎన్నడూ గట్టిగా మాట్లాడినవాడివి కూడా కాదు; అలాంటివాడివి, మింగేయడాని కన్నట్టు, మీదకొస్తున్నావంటే – అదెంత విషంపోసి ఉండాలి!!

'అక్కా!' అని బిగ్గరగా అరిచాడు ప్రసాదు.

'అప్పుడే పిచ్చి లక్షణాలు కూడా ఏర్పడ్డాయి...' అన్నది సుభద్ర.

'అయ్యో! నీకెలా చెప్ప నక్కాయ్! మీరెవ్వరూ నన్ను అర్థంచేసుకోవడంలేదు. మీ మూర్ఖత్వంవల్ల శకుంతల బాధపడుతోంది! తను తిరిగి ఆశ్రమానికి వెడతా నంటోంది.'

'లక్షణంగా పొమ్మను. అసలు నేనే వెళ్ళగొడదామనుకొంటున్నాను...దానంతటదే పోతానంటే సంతోషించక ఏమనుస్తావెందుకురా? మహారాజుగా వెళ్ళమను. కావలిస్తే ఇప్పుడే వెళ్ళి స్టేషన్‌లో కూచోమను!' అన్నది సుభద్ర.

'ప్చ్' అని చప్పరించాడు ప్రసాదు.

'లాభంలేదు. ఈ రహస్యం నీకు చెప్పకుండా ఉందా మనే అనుకొన్నాను. చెప్పి నీ మనస్సును బాధ పెట్టగూడదను కొన్నాను. కానీ, మీరు నన్నలా ఉండనివ్వడం లేదు...' అన్నాడు ప్రసాదు.

సుభద్ర ఆశ్చర్యంగా తమ్ముడు కేసి చూసింది.

ప్రసాదు ఓ నిముషం నేల కేసి చూసి, ఠక్కున తలెత్తి అక్క కళ్ళల్లోకి చూస్తూ, ఆమె రెండు చేతులూ గట్టిగా పట్టుకొని, 'అక్కాయ్! ఈ సంగతులన్నీ నీతో చెప్పవలసివచ్చినందుకు బాధపడుతున్నాను...! ముందో మాట నాకివ్వాలి... అమ్మను - క్షమించగలవా అక్కా?' అన్నాడు ప్రసాదు!

సుభద్ర వెర్రిదానిలా తమ్ముడి కేసి చూసింది. మాట రాక, క్షమించగలనన్నట్టు తల పంకించింది.

ప్రసాదు నిట్టూర్చి, గొంతు సరిచేసుకొన్నాడు.

'ముందుగా అమ్మకు మామూలు జ్వరమే వచ్చింది. క్రమంగా అది టైఫాయిడ్‌గా మారింది. అప్పుడే నేను మీకు టెలిగ్రాం యిచ్చాను. మీరు, మరో రెండురోజులకు వస్తారనగా, ఈ సంఘటన జరిగింది. ఒకరోజున...

*　　*　　*　　*

పార్వతమ్మ మంచంలో అటూ ఇటూ కొట్టుకు లాడుతోంది. డాక్టరుగూడా చాలా ప్రమాదమనీ, గండం గడవడం కష్టమనీ చెప్పాడు. అయినా మానవ ప్రయత్నం చేదామన్నాడు. ప్రసాదుకు కాలూ చెయ్యీ ఆడడం లేదు. ఒంటరిగాడు. అంతకు క్రితం, ఇలాంటివి అనుభవం లేనివాడు. మరీ రెండు రోజులనుండి, పరిస్థితి మరింతగా విషమించింది.

డాక్టరును పంపి, వచ్చేసరికి తల్లి కుమిలి కుమిలి ఏడుస్తున్నది.

'ఎందుకమ్మా ఏడుస్తావ్?' అన్నాడు ప్రసాదు. అన్నాడే గాని అతనికీ దుఃఖం పుక్కిలింతలవుతోంది.

పార్వతమ్మ కొంచెంసేపు ఏమీ మాట్లాడలేదు. తరువాత, కొడుకు రెండు చేతులూ పుచ్చుకొని, 'నాయనా! తల్లిని, మహాపాపిని! ఇంతకాలమూ ఈ రహస్యం నీకు తెలియకుండా దాచాను. ఇంకా దాచి ప్రయోజనంలేదు.' అన్నది.

'ఏమిటమ్మా ఆ రహస్యం?' అన్నాడు కొడుకు.

'నన్ను మనస్ఫూర్తిగా క్షమిస్తావా నాయనా?'

'ఏం మాటలమ్మా అవి? నేను నిన్ను మన్నించడమేమిటి?'

పార్వతమ్మ కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి...

అంతే! అంతకుదప్ప ఆమె ఏమీ మాట్లాడలేదు. ప్రసాదుగూడా మాట్లాడించాలని ప్రయత్నించలేదు. ఆ మధ్యాహ్నమే ఆమె చనిపోయింది. మృత్యువంటే ఏమిటో, అదెంత నిశ్శబ్దంగా ప్రాణాన్ని హరించివేస్తుందో, ప్రసాదు మొట్టమొదటిసారి గమనించాడు...

కర్మకాండలన్నీ పూర్తయ్యాయి. బంధువులందరూ ఒకరొకరే వెళ్ళిపోయారు. అమ్మతాలూకు చర్యలను జ్ఞాపకం చేసుకొంటూ, ప్రసాదు కుమిలిపోతున్నాడు. ఆమె ప్రాణప్రదంగా దాచుకొనే దేవతార్చన పెట్టె తీసినప్పుడు, అందులో ఓ కాయితం కనిపించగా తీసి చదివాడు.

'నాయనా !

'మీనాన్న చనిపోయ్యేనాటికి, నువ్వూ, అక్కయ్యా, చిన్నపిల్లలు; ఈసంసారాన్ని నేనొక్కదాన్నే ఈదుకురావాల్సొచ్చింది. నీ చిన్నతనంలో మన ఊళ్ళో సోమసుందరంగారనే ఆయన ఉండేవాడు. మన వ్యవహారాలన్నీ ఆయనగారే చూస్తుండేవాడు. ఆయన ఆనుకోకపోయినట్లయితే, ఈ ఆస్తి మనచేతికి చిక్కేదికాదు. పిల్లలకు లేకుండా పోతుందనే అభిప్రాయంతోనే, ఆయనచెప్పినట్లల్లా చేశాను. ఆయనకు లొంగిపోయాను. నాయనా! ఈ విషయాలన్నీ నీకు చెప్పడం ఎట్లాగా అని, నాలో నేను చాలాకాలం మధనపడ్డాను. ఇంత కాలం ఈ రహస్యం, జాగ్రత్తగా కాపాడుతూ వచ్చాను. నా మరణానంతరమే, ఈ వుత్తరం నీ చేతికి చిక్కుతుందిగనుక, అప్పుడు నువ్వు దూషించినా, భూషించినా, నాకు తెలియదనే నమ్మకంతోనే ఇలా రాస్తున్నాను.

'సోమసుందరంగారి సాహచర్యంవల్ల, తిరిగి నేను తల్లినయ్యాను. ఆయన దాన్ని మాపుచేయాలని చాలా ప్రయత్నించాడు. నేనే అంగీకరించలేదు. గ్రామంలో గుసగుసలు రేగాయి. అందరూ మనల్ని వెలివేశారు. వీధిలోకొస్తే, కాకుల్లా పొడిచి చంపుతున్నారు. అక్కడ వుండలేకపోయాను.

'అందుకే ఉన్న ఆస్థినంతా అమ్ముకొని, ఈ దూర దేశం రావడం జరిగింది. మీనాన్న మరణానంతరం పుట్టిన ఈ బిడ్డను ఏంచేయాలో నాకుతోచలేదు. విడిచిపెట్టడానికి చేతులు రాలేదు. చాలా రోజులు, అలానే ఆలోచిస్తూ ఉండిపోయాను! బిడ్డ రోజురోజుకూ ఏపుగా ఎదుగుతున్నది. ఇద్దరు

బిడ్డలను పెంచిన చేతులతో, నా మూడవ బిడ్డను చంపలేక పోయాను. అమాయికంగా నవ్వుతూ, బుల్లిబుల్లి చేతుల్ని, కాళ్ళను గాలిలో ఆడిస్తూ, నన్ను చూసినప్పుడల్లా కేరింత లాడే ఆ పసిపాపను, వసలలేక నాలో నేను కుమిలిపోయ్యాను. రాత్రిం బవళ్ళు, ఆ పసిదాన్ని తలుచుకొని, పరితపించాను...

'కానీ, తప్పనిసరైంది! లోకంఘోర రాక్షసిలాగా నన్ను కనిపెట్టి ఉంది! అదీగాక, నువ్వూ నీ అక్కా - పెరుగుతున్నారు. మీరు పెద్దవారయాక, ఈ సంగతి తెలిస్తే, ఎంత బాధ పడతారోననీ, మీ భవిష్యత్తు ఎలా మారుతుందోననీ, నాకు భయం వేసింది! అందుకే, నా మాతృహృదయాన్ని చంపు కొన్నాను. నా పెద్దపిల్లల క్షేమం కోసం, నా మూడవపిల్లను అనాథను చేశాను. రాక్షసిలాగా ప్రవర్తించాను...ఎవరో ఆనందస్వామి పేరు నాకు చెప్పారు. ఒకనాటి తెల్లవారు ఝామున, ఆ బిడ్డను, ఆశ్రమం దగ్గర విడిచి వచ్చాను.

'ఇప్పుడు నీ చెల్లెలు ఆ ఆశ్రమంలోనే ఉంది. ఆమెకు ప్రతి సంవత్సరం నేను ఏవో కానుకలు పంపుతూనే ఉన్నాను. కానీ ఈ ఏడు నేను పంపలేకపోయాను. నా బిడ్డను కడసారి చూడాలన్న ప్రయత్నం కూడా నెరవేరలేదు.. ఈ జీవి తంలో అది సాధ్యపడదని నాకు తెలుసు. కన్న బిడ్డను, చేతు లారా పెంచుకొనే భాగ్యం నాకు లేకపోయింది. లోకానికి జడిసి నా బిడ్డను అనాథను చేశాను...ఇప్పుడు నీ చెల్లెలి బాధ్యతను నీ కప్పగిస్తున్నాను. ఆమెను పాల ముంచుతావో, నీట ముంచుతావో, నీదే భారం! నేను చాలా తప్పులు చేశాను. అయినా నన్ను క్షమించు. —అమ్మ

ఉత్తరం చదవడం పూర్తయింది. ప్రసాద్ వణికి పోయాడు. చెప్పలేనంత ఆవేశం వచ్చింది. 'అమ్మా' అని బిగ్గరగా కేకవేశాడు. ఆ కేకకు గది గోడలు ప్రతిధ్వనించాయి.

*       *       *

'అక్కయ్యా! ఆ మరునాడే నేను ప్రయాణమయ్యాను. ఆనందస్వామివారికి, ఆ ఉత్తరం చూపించాను. ఆయన, శకుంతలను నా వెంట పంపారు. చాలా సంవత్సరాల తరవాత, మనకు దొరికిన చెల్లిని నీకు చూపెడదామనీ, ఈ ఆనందంలో, నువ్వూ భాగం పంచుకొంటావనీ, నేను శకుంతలను ఇక్కడకు తీసుకొచ్చాను. నువ్వు నన్ను మరోలా అర్థంచేసుకొన్నావు. ...అక్కా! అమ్మ, తను చేసిందేమిటో మనకు చెప్పింది. ఆమె నిప్పుడు దూషించడం మంచిది కాదు. తన బిడ్డలే తనను దుయ్యబట్టడాన్ని, ఏ తల్లి హృదయమూ సహించలేదు. అమ్మ చేసింది చెడ్డపనే అయినా, నువ్వు అమ్మను క్షమించాలి అక్కా! లేకపోతే, ఆమె ఆత్మ క్షోభించిపోతుంది.' అన్నాడు ప్రసాదు గద్గద స్వరంతో.

సుభద్రకు పిచ్చిచూపులుపడ్డాయి!

'అమ్మ మంచిది! చాలా మంచిది! తమ్ముడూ! అమ్మ చాలా మంచిది!' అన్నది సుభద్ర, తమ్ముడి భుజంమీద తల ఆన్చి వెక్కి వెక్కిపడుతో. ఎంత మంచిది గాకపోతే, నేను చేసిన తప్పును, తనమీద వేసుకొంటుంది అమ్మ!...అమ్మా! నువ్వు మంచిదానివి! చాలా మంచిదానివి!!' అని భోరుమని ఏడ్చింది సుభద్ర.

# అద్దెకొంప

నేనేదో మహా అనుభవం ఉన్నవాణ్ణని కాదుగానీ, రకరకాల మనుష్యులతో నాకూ పరిచయం వుంది. కొందరితో స్నేహంచేశాను. కొందరిని ఆప్తులుగా భావించాను, ఇంకో బాపతు జనాన్ని వుంచవలసినంత దూరంగానూ వుంచాను. లోకంలో రకరకాల మనస్తత్వాలున్నవా రుంటారని, నాకు ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఎందుకంటే—నాకున్న పరిచయస్థుల్లో, చాలా రకాలవారూ, అనేక వర్గాలకు చెందినవారూ వున్నారు. వారి వారి అభిప్రాయాలతో, నాకు ఏకీభావం కుదరని సందర్భాలు బొచ్చెడున్నాయి. అంతమాత్రాన వారంతా నా విరోధులని, నే నెట్లా అనను?

ఎవరి గొడవ వారిదీ, ఎవరి కష్టసుఖాలు వారివీను! నేను అర్చేవాణ్ణీ తీర్చేవాణ్ణీ కాదు. ఇట్లా సరిపెట్టుకొనే, నేను శివరామయ్యగార్ని ఏమీ అనేవాణ్ణి కాదు. చూడటానికి శివరామయ్య చాలా సాత్వికుడుగానూ, మాంచి వ్యవహారవేత్తగానూ వుండేవాడు. భాగ్యమ్మగారు కూడా ఆయనకు తగ్గదేననిపించింది. అదీగాక — వాళ్ళు చాలాకాలం క్రిందటే మద్రాసులో స్థిరపడిపోయిన తెలుగువాళ్ళు. సగం అందుకే నేనా యింట్లో ప్రవేశించాను.

ఏదైనా తింటేగానీ రుచీ తెలియదు. దిగితేగానీ లోతు తెలియదు. ఆ యింట్లో మూణ్నెల్లపాటు, అద్దెవంగా, నేనుండకపోయినట్లయితే, శివరామయ్య ఇలాంటివాడని—హరిహరాదులు చెప్పినా నమ్మేవాణ్ణి గాదు. పైకి సాధువులుగా కనిపించే వారిలో, ఎంతటి రాక్షసత్వం దాగివుండటానికి అవ

కాశం వుందో, ఆయన్ను చూసిందాకా, నాకు తెలియదు.

భార్యా భర్తలన్న తరవాత, మాటామాటా రానడమూ, కీచులాడుకోవడమూ సహజం కావచ్చు. వాళ్ళ గొడవతో మనకెందుకులెస్తూ—అనే; వాళ్ళ కీచులాటల్లో నేను వేలుబెట్టేవాణ్ని కాదు. నా భార్యను గూడా అటు కేసి వెళ్ళవద్దని గట్టిగా చెప్పాను.

భార్యల్ని వేపుకుతినడం గూడా వ్యాధి కిందకే వస్తే, శివరామయ్య ఆ జబ్బుతో బాగా తీసుకొంటున్నవాడి కిందకే వస్తాడు. ఆయన పెళ్ళాన్ని అనరాని మాటలనేవాడు. నిమిష నిమిషానికీ కొట్టటానికి మీదిమీదికి పొయ్యేవాడు. ఆయనున్నంతసేపూ ఇల్లు యుద్ధరంగంలా ఉండేది.

నేనిది చాలాకాలం భరించాను. చాలాకాలం పస్తాయించాను. ఆఖరికి వుండబట్టలేక, ఒక రోజున తెగబడ్డాను.

'అది నా స్వంత విషయం! ఇందులో మీ జోక్యమేమీ లేదు.' అన్నాడాయన.

ఇలాంటి సమాధానమే వస్తుందని నాకు తెలుసు. అప్పుడు నేను నోరుమూసుకోవలసివస్తుందని గూడా తెలుసు. ఇన్ని తెలిసి గూడా మరెందుకు తలదూర్చానయ్యా—అని, నన్నడక్కండి! భాగ్యమ్మ పడే చిత్రహింసలు చూడలేక నే తల దూర్చాను.

నేనలా జోక్యంచేసుకోవడం చాలా మంచిదే అయింది. శివరామయ్య పెళ్ళాన్ని కాల్చుకుతినడం తగ్గిపోయింది. ఓ మంచిపని చేశానన్న సంతృప్తి కలిగింది.

అయితేఇంతకు రెండింతలు, ఆమెను రహస్యంగా వేధించుకుతింటున్నాడని. భాగ్యమ్మగారు చెప్పిందాకా నాకు తెలియదు. ఆమె నా దగ్గర, తన సొదంతా వెళ్ళ బోసుకొంది.

'అయ్యో, నాయనా! నువ్వలా నన్ను వెనకేసుకురాక పోయినా బాగుణ్ను' అని కంటతడిబెట్టుకొంది భాగ్యమ్మగారు.

'ఏమయిందేమిటండి?' అన్నాను.

'ఆ పాపిష్టి మాటలన్నీ నా నోట మళ్ళా ఎందుకు చెప్పిస్తావు నాయనా!' అన్నదామె, తప్పుకొంటూ.

నేను మా ఆవిణ్ణి పిలిచి అడిగాను!

'ఆఁ ఈ మొగజాతి కేముందీ! పెళ్ళాల్ని కాల్చుకు తినడమొక్కటే చేతవును.' అన్నదావిడ.

'అది సరేనే! భాగ్యమ్మగారు నన్ను చూసి, కళ్ళనీళ్ళు పెట్టుకొంటుందేమి? నేనేం చేశాను?' అన్నాను.

'అప్పటికీ నేను ఒద్దు మొర్రో అంటుంటిని. నా మాట వినకపోతిరి. అనవసరంగా వెళ్ళి వేలుపెడితిరి. ఇప్పుడు భాగ్యమ్మగారి పీకలమీదకొచ్చింది...అదిగాదండీ! మంచి వాళ్ళతో మంచి గానీ, ఇలాంటి లుచ్చాలతో మంచేమిటండీ నా బొంద? 'వాడికీ నీకూ ఏమీ లేకపోతే, వాడెందుకు నీ తరఫున వస్తాడూ' అన్నాట్ట శివరామయ్య. 'ఈ ఉద్దేశ్యంతో నేనా, వాడిదగ్గర అప్పన్ను పుచ్చుకొన్నదీ!' అన్నాట్ట. 'ఇలా ఎంత కాలం నుంచి రంకు సాగిస్తున్నావ్?' అన్నాట్ట. ఆ మానవు రాలు, నిన్నటినుంచీ, గంగ ముట్టకుండావుంది! మీరేం చేసినా ఇలాగే చేస్తారు. దేవనబోయ్యే తద్దినాన్ని నెత్తికి చుట్టుకొ

న్నారు. అనుభవించండి!' అన్న దావిడ.

భార్యల్ని అనుమానించే భర్తలు నాకు తెలుసు. అలాంటి భర్తలు, పెళ్ళాల్ని పెట్టే రంపకోత నాకు తెలుసు. కానీ ఇదేమిటి? ఆవిడకు నాకు పొత్తేమిటి? కనీసం ఆవిడ కొడుకు వయస్సు గూడా నాకు లేదే?

శివరామయ్య ముఖం చూడ్డానికే రోత కేసింది. ఇలాంటి దగుల్బాజీ కొంపలో ఒక్క క్షణం గూడా వుండగూడదను కొన్నాను. ఇప్పుడే ఇంతమాట అన్నవాడు—రేపు ఇంకేమైనా అంటాడు.

ఆ తెల్లవారే, ఇంకో ఇంట్లోకి మారాను. కనీసం మాట మాత్రమైనా 'ఎందుకు మారుతున్నా' రని శివరామయ్య అడగలేదు. ఆయన ముఖం చూస్తే, 'ఈ పీడా ఎప్పుడు వదిలిపోతుంది భగవంతుడా' అన్నట్టుంది.

అయితే వారం తర్వాతగానీ నాకు అసలు సంగతి తెలియలేదు. నేనుఖాళీచేసిన సాయంత్రమే నాకంటే పదిహేను రూపాయల ఎక్కువ అద్దెకు శర్మ ఆ యింట్లో చేరాడు.

శివరామయ్య, భార్యను ఎందుకు అనుమానించిందీ అప్పుడు నా కర్థమయింది. రేపు శర్మకన్న మరో అయిదు రూపాయలు ఎక్కువిచ్చేవాడు దొరికినప్పుడు, శివరామయ్య, మళ్ళీ భార్యను అనుమానిస్తాడు. ఆవిడ శర్మముందు, మళ్లీ కళ్ల వెంట నీళ్ళు పెట్టుకొంటుంది.

నాకు పట్టుకొన్న బాధల్లా ఒక్కటే? మొగవాడు గనక శివరామయ్య ఏదో అఘోరించాడు; ఈ భాగ్యమ్మకెట్లా బుద్ధిలేదా — అని ?

———